శ్రీరామాయనమః.

# తిన్నడు, గుణనిధి.



విద్వాన్ వర్ధమాని లక్ష్మీనరసింహశాస్త్రి,
ప్రధానాంధ్రోపాధ్యాయుడు,
బోర్డు హైస్కూల్,
పాలకొండ.



రామా అండ్ కో,
విద్యావిషయిక ప్రచురకులు,
ఏలూరు.

**1929.**

 *(Price 0-10-0.*

# తొలిపలుకు.

బ్రహ్మశ్రీ విద్వాన్ వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రి గారిచే రచియింపఁబడిన "గుణనిధి" యను గ్రంథము నందలి కథాంశము శ్రీనాథకవి విరచితంబగు "కాశీఖండము" నుండి సంగ్రహింపఁబడినది. ఈవచన గ్రంథమునందు మాతృకలో లేని విషయములు కొన్ని చేయఁబడినవి. అవియు లోకమునను సరించియున్నవి. కాన నామార్పులు గ్రంథమునకుఁ బ్రతికూలములై యుండ నోపవు. నేఁడాంధ్రలోకమునకు నవలలెట్టి హర్షోత్కర్షమును గలిగించుచున్నవో యట్టి యామోదము నీగ్రంథము కలుగఁజేయఁ గలదని నాకృత నిశ్చయము.

గ్రంథకర్త యనేక వత్సరములనుండి యున్నత పాఠశాలలయందుఁ బ్రధానపండితులుగఁ బనిచేయుచు బాలుకుపయుక్తమగుపఠనీయగ్రంథముల శైలియెట్లుండవలయునో బాగుగ గుర్తించిన వారగుటచేఁ గథనంతటిని మృదుమధుర శైలిని వ్రాయఁగలిగెను. పదలాలిత్యము, సమాసముల పొందికయుఁ బాఠకుల హృదయముల నాకర్షింపఁగలవు.

ఈగ్రంథము నున్నత పాఠశాలలయందలి యయిదాఱు ఫారముల కప్రధానవచనముగాఁగానినాలవఫారమునకుఁబ్రధాన వచనముగాఁగాని యుపయోగింపవచ్చునని నాయాశయము.

గ్రంథకర్త వయసునఁ బిన్నయయ్యుఁ దన వచనగ్రంథముచే నాంధ్రలోకమున కచిరకాలమునఁ గృతపరిచయుఁడు కాఁగలఁడని నానమ్మకము. ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయు లీగ్రంథమును దమ పాఠశాలలోఁ బఠనీయగ్రంథముగ వాడుక చేసియు, నాంధ్రభాషాపోషకులును, బండితులును దీనిని సాదరభావముతోఁ జదివి లోపంబులు గలవేని రెండవ కూర్పునందు సవరించుకొనుటకై గ్రంథకర్త కెఱిఁగించియు వారిని బ్రోత్సహింతురుగాక.

బోర్డుహైస్కూల్,
పాలకొండ.

ఇట్లు,
(Sd.) ర్యాలి వెంకటజోగారావు,
బి.ఏ. యల్. టి., హెడ్మాష్టర్.

# విజ్ఞాపనము.

—:o:—

నేనీ చిన్నపొత్తమును నామిత్రుల ప్రోత్సాహమున నున్నత పాఠశాలలలో నాలుగైదాఱు ఫారములఁ జదువు బాలురకుపయోగించునటుల రచించితి. దీనిని శ్రీనాథుని కాశీ ఖండము నాధారముఁజేసికొని రచించినాఁడను.

నేనింకను గ్రంథరచనకు బాగుగ నలవడియుండ మిచే నిందు లోపములు మెండుగ నుండవచ్చును. విద్వజ్జను లాలోపములను మన్నించి నాయెడ సోదరభావమును జూపుచుఁ దెలియఁజేసిన రెండవ ముద్రణమున సవరించుకొనువాఁడను. దీనికి శ్రమయనక తమ యుదారాభిప్రాయముల నొసఁగిన పండితోత్తములకు నామనఃపూర్వకాభివందనముల నర్పించు చున్నాఁడను.

నా యీయుద్యమమునకుఁదోడ్పడితగుప్రోత్సాహమును జేయు విద్యాశాఖాధికారులను, నున్నత పాఠశాలల ప్రధా నోపాధ్యాయులను బ్రార్థించుచున్నాను.

నన్నీయుద్యమమునకుఁ బురికొల్పి యథాశక్తి తోడ్పడిన పరోపకార ధురీణులును, బట్టభద్రులును, బ్రధానోపాధ్యాయు లును, నగు శ్రీ ర్యాలి వెంకటజోగారావుపంతులు గారికి నే ననవరతము గృతజ్ఞుఁడనై యుండువాఁడను.

బోర్డుహైస్కూల్,
పాలకొండ.

ఇట్లు విద్వజ్జనవిధేయుఁడు,
విద్వాన్ వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రి,
ఆంధ్ర ప్రధానోపాధ్యాయుఁడు.

# అభిప్రాయములు.



బ్రహ్మశ్రీ వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రిగారు తా రచించిన "గిరిజాపరిణయము, గుణనిధి, తిన్నడు" అను మూఁడు వచన కావ్యములను అచ్చటచ్చట జదివి నాకు వినిపించిరి. శాస్త్రిగారెంచు యిందలి యితివృత్తము సుప్రసిద్ధగ్రంథములలోనిది. బడిలో జదువు బాలురకు మిక్కిలి నీతిబోధకము. ఈశ్వరభక్త్యుద్బోధకమునై యున్నది. శైలియన్ననో మృదుమధురముగాను, నిర్దుష్టముగాను నున్నది. ఇప్పుడు నూతనముగ వెలువడుచున్న వచనకావ్యములకును నీ గ్రంథమునకు నధికవైలక్షణ్యము కలదు. నాలుగైదారు ఫారముల జదువ బాలురకీ గ్రంథము చదువదగిన పాఠపుస్తకము.

విజయనగరము } (Sd.) మేడేపల్లి వెంకటరమణాచార్యులు,
12—1—'7 } విజయనగరము మహారాజావారి యాంగ్ల కళాశాలలో సంస్కృతాంధ్రోపాధ్యాయుడు.



**V. Ch. Sitaramasastry,**
Member, Andhra University Senate;
Senior Telugu Pandit,
Maharajah's Sanskrit College.

Vizianagaram.
15—1—27

బ్రహ్మశ్రీ విద్వాన్ వడ్లమాని లక్ష్మీనరసింహశాస్త్రి గారిచే రచింపబడిన గుణనిధి, తిన్నడు అను గ్రంథములను నేను స్థాలీపులాకన్యాయమున జదివితిని. విద్యార్థి జనోపయోగమునకయి గ్రంథకర్త చేసి యీ భాషాసేవ మిగుల ప్రశంసనీయమై యున్నది. వీనిలోని శైలి మిక్కిలి మృదువయియుండుటచే విద్యార్థులకు సుగ్రాహము కానోపును. వీనిలోని కథలు నీతిబోధకములైన విద్యార్థుల కవశ్యపఠనీయములై యుండునని దృఢముగ జెప్పగలను.

(Sd.) వఝుల చినసీతారామస్వామిశాస్త్రి.



Maharajah's College
Vizianagaram.
12—2—27.

I have gone through portions of three Telugu books **Girijaparinayam, Thinnadu,** and **Gunanidhi** written by M. R. Ry. V. L. Narasimhasastry garu of Board High School Palakonda. They are all in chaste and classical style. The narrative is of a dignified character. They are fit for being used in High School Forms in the Telugu Districts. They are a very good introduction to the valuable works of Srinadha and Dhurjati. The books deserve circulation especially among the students in the higher classes. I trust that they will be printed and published at an early date.

(Sd.) M. VENKATA RANGAYYA,
Chief Lecturer in History.

---

I have read with much pleasure certain portions from గిరిజాపరిణయము, గుణనిధి, తిన్నడు, prose works written by Vidwan Vadlamani Lakshmi Narasimha Sastry garu. All the three books were written in elegant and chaste style. The author being a Pandit having work with High school forms has carefully adapted a style which is quite suitable for the boys in the Higher forms. Hence they do quite well to be as text books in forms IV and V.

Vizianagaram
15—1—27.

(Sd.) A. RAMARAO,
Senior Telugu Pandit,
Maharajah's College.

Palakonda,
11—12—26.

I have carefully read through the story Gunanidhi written by Brahmasri VadlamaniLakshmi Narasimha Sastry garu, Vidwan. Telugu Pandit of Bd. High School, Palakonda and am glad to say that its merits lie in the choice of language and treatment of incidents.

The subject matter of the book is drawn from Kasikhandam. The disastrous result of a father's neglect and a mother's indulgence in matter of a son's education are videly depicted. The story also exemplifies how service rendered to God though unconsciously bears unlimited fruit.

The immediate interest in the book lies in the fact, it iswritten by a School Pandit that has actual knowledge of pupils' requirem ents and their standard of knowledge. It makes suitable study for pupils of High School Forms.

(Sd.) G. VENKATESWARLU,
Dy. Inspector of schools.

---

ANDHRA RESEARCH UNIVERSITY

Vizianagaram City (S. India)

| Chancellor | President |
|---|---|
| His Highness | Chevalier Baron of Aran |
| the Maharajah Saheb | B.Seshagirirao M.A (Madras |
| Bahudur of Vizianagar | Ph. D; M.S.A.(Paris) |
| Raj. | |

Brahmasri Vidwan Vadlamani Lakshmi Narasimha Sastry garu has read out to me portions of his prose books గిరిజాపరిణయము, గుణనిధి, తిన్నడు. based on Puranic, Poetic Literature. They are composed in a clear, flowing, chaste and dignified style and are in my opinion fit to be prescribed as reading books for the upper forms in secondary schools.

(Sd.) B. Seshagiri Rao.
1—2—27.



# తిన్నఁడు.

## మొదటిప్రకరణము.

### —♦ నరునితపము ♦—

సత్యబద్ధుఁడగు ధర్మరా జరణ్యమున సోదరుల తోడను బ్రియయగు ద్రుపదనందన తోడను, గానల నిడుములఁ గుడుచుచుండెను. అత్తఱిఁ బార్థుఁడు శివునిఁ గూర్చి తపమాచరించి యాతని వలనఁ బాశుపతమును బొంది కౌరవకులాటవీదహనముం జేయ నుత్సుకుఁడై నిర్జనపలనంబుల కరిఁగి యందొక రమణీయతరాశ్రమముం జూచె. అయ్యది నానావిధ కుసుమ ఫలభరిత వృక్షషండంబుల చేతను, శకుంతంబుల కధీనమై యింపుఁగులుకు నికుంజపుంజంబుల చేతను, మధురతరవారి పూరంబులును, గైరవాదిశోభితంబులును, రాజహంస నివాసోచితంబులును నగు సరసులచేతను విరాజిల్లుచుండెను. మఱియు నయ్యాశ్రమంబున హరిణశాబకములు, ధర్భాంకురముల మేయుచు నందందు స్వైరసంచారములఁ గావించుచు

నాశ్రమ దిదృక్షువులై యేతెంచిన పథికజనుల కాశ్రమరామ ణీయకమునఁ జూపుచున్నవో యనునటులఁ దరుశాటికలకుఁ బరువులిడుచుండెడివి. ఇంకను బరస్పర విరోధి జంతువులును గూడ నచ్చ్యాశ్రమమున నమందానురాగంబున వర్తించు చుండినవి. అట మునిజననికాయంబులు క్రతువుల నాచరించుచు నమితానంద పరవశులై యుండిరి.

మధ్యమ పాండవుండందుఁ జేరి ఋషిజనానుమతి నయ్యాశ్రమంబున నీశ్వరానుగ్రహమును బడయనెంచి సూర్యాభిముఖుఁడై శీతాతప సర్గములకోర్చి కొన్నినాళ్ళును, బర్ణ భక్షకుఁడై యొంటికాల నిలిచి కొన్నినాళ్లును, వాయు భక్షకుఁడై మఱికొన్ని నాళ్లును, ఘోరముగఁ దపమాచరించు చుండెను. పుత్త్రవాత్సల్యమునఁ గావలయుఁ బరులు చేయు తపమునకు భీతిల్లి యుపాయాంతరముల వారి తపోవిఘ్నముల నాచరించుచుఁ బరసహనా భావుఁడను బిరుదమును సము పార్జించిన యింద్రుఁడు నరుని తపమున కావంతయేనియు విఘ్నము నాచరింపలేడు. అహహా! లోకమున నెట్టి కట్టిఁడి యైనను బుత్త్రుల కార్యములకు విఘ్నముల నాచరింప నొల్లఁ డుగా? ఇటుల నరుఁడు నిర్విఘ్నముగఁ దపమును నిరాహారుఁ డును, దదేక నిష్ఠాగరిష్ఠుఁడును, నీశ్వర సందర్శనాభి లాషియుఁ బాశుపత సంపాదనాసక్తుండును, గౌరవకలాటవీ దహన దోదూయమాన మానసుఁడును నై చేయుచుండెను. అత్తఱి

నయ్యర్జున తపమునకై భీతిల్లి దేవతలు భక్తవత్సలుఁడును, స్త్రీజితుఁడును, నివాసీకృత పితృకాననుఁడును నగు ఫాలలో చనుని సందర్శించి తమకుఁ బాండవమధ్యమునివలన రానున్న యాపదను విన్నవించి తమ్మా యాపదనుండి కాపాడుమని కడుంగడు దైన్యమునఁ బ్రార్థించిరి. శివుఁడు విదిత పార్థ మనోరథుఁడై వారల కభయదానంబొసంగి పంపివేసెను. దేవతలు మహేశ్వరునిఁ బొగడుచు స్వపురముంజేరి సుఖముండిరి.

## శివుఁడు కిరాతవేషమును బూనుట

పాపము! భక్తవత్సలుఁడగు శివుఁడు కిరీటి తపమునకు మెచ్చి యాతనిని సఫలీకృతమనోరథునిగఁ జేయ నుత్సుకుఁడై యజ్ఞాత కిరాత వేషుఁడయ్యె జడలను సంకుచిత పఱచియు, ఫాలనేత్రి మగపడకుండ సిందూరపు బొట్టును ధరించియు, బుణికహారమునను మాఱుగ గురువెంద దండను దాల్చియు ఫణిహారములఁ దీసి గజచర్మమును దాల్చియుఁ బినాకమును వింటిబద్దగఁ జేసియు శూలమును గోలగఁజేసి ప్రమథగణములు కిరాతులుగా నదిత్రినయ చెంచెతకాఁగాఁ దాను మాయా కిరాతుఁడై మూకాసురునిఁ గోలముగఁజేసి మృగయాసన్నద్ధుఁడై యర్జునాశ్రమ ప్రాంత భూమిం దఱియంజొచ్చి యందందుఁ దపోవిఘ్న మాచరింప నుద్యుక్తుఁడై యంవలి శకుంతంబుల బెదరించుచు మృగగణంబులఁ బాఱఁదోలుచుఁ బరివారముతో నటఁ గోలాహలముఁ జేయుచుండెను. మాయా

కిరాతుఁ డెన్నివిఘ్నములను గలుగఁజేసినను నరుఁడు తన తపము విఘ్నముల పాలుకాకుండ నియతనిష్ఠ నీశ్వర సన్నిధానమును గల్పించుకొని యాంతరదృష్టి నీక్షించుచు నితరముల మఱచి యుండెను. కాటిఱేఁడు వ్యర్థీకృత ప్రయత్నుఁడై యుపాయాంతరమును గానరేక కిటివేషధారియగు మూకాసురునిఁ దరుముచునాతనినిసమీపించెను. అంతఁ దపఃపరిపూర్తియగుడు గిరీటియుఁ మృగయాసక్తుఁడగుటంజేసి యయ్యేకలమును గొట్టెను. తోడనే యా కిటి తన్నుకొనుచు నేలంబడి యుండె. అప్పుడ మాయాకిరాతుఁడద్దాని సమీపించి దానియొడలి బాణమును దీయుచుండఁ బార్థుఁడు స్వనామాంకిత బాణము తగిలి బడియుండుటంజేసి యావరాహము న జేకొనఁగూడదని కిరాతు నాక్షేపించెను. చెంచు కూడ నారీతినే చెప్పి దానియొడలియందు స్వనామాంకిత బాణమును జూపించి దానికై యాతనితోఁ బెనకులాడఁ జొచ్చెను.

## —♦ నర కిరాతుల యుద్ధము ♦—

నరుఁడజ్ఞాతేశ్వర మాయావిలసితుఁడై తానేసిన యేటునఁ బడిన కిటిని మఱల నొక మృగయుఁడు ముట్టుట వీరధర్మము కాదని చెప్పి యాతనిఁ బాఱఁదోల సమకట్టెను. మాయాకిరాతుఁడు తనకుఁ గల భక్తవాత్సల్యమును జూపనెంచియు నరుని విక్రమంబును గుర్తించి యాతని బలపరాక్రమాదుల లోకమునకు వెల్లడిచేయ నెంచియు, "నేఁబూర్వమేసిన వరాహమును

గొట్టి యింకను నిజమగు శూరునివలెఁ జెప్పుచున్నాఁడవా? ఇదియా నీ పరాక్రమము? ఇదియేనా నీ వీరధర్మము? జడల ధరించి యడవుల నాకలములఁ దిని మను నీకును, శౌర్యమునకును జాల యంతరము గలదు, నీయట్టి వారెంద రెందరో మాకు లోనై యున్నవారు. నీకుఁ బ్రాణములపై నాసగలదేని యిపుడువరాహమును విడిపొమ్ము. లేదేని యుద్ధమునకురమ్ము. నాప్రతాప పటిమనుజవిచూచెదవు". అని ప్రగల్భ వచనములఁ బల్కెను. వీరాధివీరులనేని బాహు బలంబు సరకుఁగొనని పార్థుఁడు కిరాతుని వీరాలాపములకుఁ బ్రళయ కాలాగ్నిభంగి మండి పటపటం బండ్లుగొరుకుచుఁ దల యూచుచు సజ్జీకృతచాపుఁడై "యేమేమీ! కిరాతా! నీనోటికి వచ్చినట్లరచుచున్నావే! నీవు నన్నుఁగాన నాకలములఁగొని మను మునివలెఁ దలంచుచున్నావుగా? నాయుదంతమును విను. నేనా సత్యవాక్పాలనా పటిష్ఠుఁడగు యుధిష్ఠురుని సోదరుఁడ నగు నరుడనుజుమా! బకాంతకుఁడగు భీమసేనుని సోదరుఁ డను. ఇట్టి నాతోఁడనా నీవు యుద్ధము సేయుట? ఈయడవుల నుండి యుద్ధమన నేమో యెఱుంగక నీగొందియే లోకంబను చును నీవే వీరుఁడనుచును, దలంచుచు "ఉక్కెక్కిన సింగపుఁ గొదమను నక్కపిల్ల యెదిరింపఁజూచిన చందాన" నన్నెదిరింప జూచెదు. అహాహా! యేమి నీయవివేకము? తరంబెఱుంగక యేల యూరక యెక్కుడువారిని ధిక్కరించి కాలాగ్నిజ్వాలల

నెదిరి ప్రాణములఁ గోల్పోవు శలభంబురీతి నూరక చెడియె దవు? నామాటలనాలించి యిఁకఁగొన్ని నాళ్ళు కొనఁజెంచులం గూడి మనఁ గోరితేని నాయీవరాహమును వీడిపొమ్ము. చాఁ గోరుదేని రమ్ము సమరమ్మున" కని పలుకఁ గిరాతుఁడు నగుచు "నేమేమీ? యెన్నఁడును వినని మాటలఁ బల్కెదు? ఎందులకీ నోరిచాపలంబు? నీయీ దంభవచనంబులకు డెందంబున లేని భీతిని నెలఁగొల్పి పాఱునట్టి వాఁడింతెవఁడును లేఁడు. నీపరాక్రమమును రణమునఁ జూపిన సంతసింతునుగాని మాటలఁ జూపిన సంతసించువాఁడనుగాను. పోర మన యంతరములు వెల్లమగుఁగాక" యనుచు బాణధారియై యుద్ధమునకుఁ దలపడుడు నరుఁడును గలనికిఁ గట్టాయితంబై నిలిచె. అంత నిరువురును బరస్పర విజిగీషాత్తస్వాంతులై సింగపుఁ గొదమలమాడ్కి గర్జించి హుంకరించుచు నొకకొంతసేపు ఘోరముగఁ బోరు సల్పునపుడు నరుఁడు చెంచు నిసుమంతయేని లక్ష్యముసేయకె స్వపరాక్రమమును జూపుచుఁ బాణపరంపరల నేయ మాయా కిరాతుఁడు కుపితుఁడై "పీడించుకయేని నన్ను సరకుఁగొన కున్నవాఁడు. ఇఁక నుపేక్షించిన కార్యంబు చెడు" ననుచు స్వమాయచే నాతని యమ్ముల పొదియందు మందునకైన బాణములేకుండఁ జేసెను. అద్దానిని గనుఁగొన నేరక కిరీటి యెక్కుడించి యాబాణముతో ఫాలాక్షుని శిరము పగులు నటుల మోదెను. దానికోడక చెంచు నిజకోదండంబునుబూని

యాతనిఁ గొట్టెను. ఇటుల వారిరువురును గోదండంబులఁ బూని పరస్పరాకర్షణాయత్తచిత్తులై శరీరములు నొవ్వ గొట్టుకొనుచుఁ గొంత సేపటికి ధనువుల వీడి మల్లయుద్ధముఁ జేసియు నొకళ్లొకళ్ళపై బడుచు జేసాచి పిలుచుచు నించుక వెనుకకు మరలి వచ్చుచు "సిదె కొట్టెద కాచుకొ" మ్మని చెప్పుచు స్వపరాక్రమములఁ జూపుచుండిరి. అంత శ్వేతవాహనుఁడు విసిగి యుద్ధమును మానక తనతో సరిగఁ బోరుసల్పుచుండుటం జూచి యానందించి యాతని బలమునకు తానే యోటువడి 'హరుఁడు దేవగణంబులు తన్ను సేవించుచుండగను గిరిజ వామపార్శ్వంబుననుండి యూడిగములఁ జేయుచుండగను, శరీరమున గజాజినము వ్రేలాడుచుండఁగను గాత్రంబున భోగిభోగంబులు విరాజిల్లుచుండఁగను జంద్రరేఖ స్వమౌళిఁ దాండవమాడుచుండఁగను, నిర్జితకుసుమబాణుండును, భస్మవిలిప్తసర్వాంగకుండును, వృషభారూఢుండునునై నిజస్వరూపముతో సాక్షాత్కరించి కిరీటిం గాంచి "వత్సా! నీ తపమునకును, శౌర్యమునకును మెచ్చితి. ఇఁక రణమును జాలింపుము. నేఁ బరాభూతుఁడనైతిని. ఇఁక నీ యీప్సితమును దెలియఁ జేయుము. నీ కోరిన వరమును బ్రసాదించువాఁడ" ననుచుఁ దెల్పెను.

—♦ నరుఁడు పాశుపతమును బొందుట. ♦—

ఫల్గునుఁడు భక్తవత్సలుఁడగు నుమాకాంతుఁడు ప్రత్యక్షమైనతోడనే సంభ్రమచకిత గాత్రుఁడును గద్గదకంఠుండును, ముకుళి

తాంజలియునై సాష్టాంగముగఁ బ్రణమిల్లి "దేవా! నే భవదాభిముఖ్యమును గోరి యీ నిర్జనవనమునఁ దపమాచరించుచుండ నీ వీరూపమున విచ్చేసి నాకు దర్శనమిప్పించినాఁడవు. మఱియు నా యపచారమున కోర్చి నాతో యుద్ధమొనర్చితివి. నేను నిన్ను సామాన్యపుఁ గిరాతునిగ నెంచి నీమాహాత్మ్యమును గనుఁగొననేరక యవివేకినై నీతో సమరమును జేసినాఁడ. నా యీ యపరాధమును మన్నించి యజ్ఞాత భవత్ప్రతాపుఁడనగు నన్ను దయతోఁ గాపాడవే" యని దైన్యంబుగఁ బ్రార్థించెను. నరుని యనన్యసామాన్య భక్తికిని, మనోద్రఢిమకును డెందంబున సంతసించుచు నాశ్రితావన తత్పరుఁడగు నుమాకళత్రుఁడు "వత్సా! నీలోపంబేదియును లేదు. నీవు నాభక్తుఁడవు. నీ కేదేని వరము కావలసిన నడుగుము." అన నాతఁడు "దేవా! యోగిజను లెవ్వని యాభిముఖ్యమును గోరి నిరాహారులై కాసలఁ దపమును నియతనిష్ఠఁ జేయుచున్నారో? వేదాది విద్యలెవ్వని రూపమును వేనోళ్ళం జాటుచున్నవో? దేవగణంబు లనవరత మెవ్వని సేవించి యమితసుఖంబులఁ గాంచుచున్నవో? యుమాదేవి చిరకాల మడవుల నిడుములఁ గుడిచి యే మహనీయునిఁ జేపట్టినదో? వేయేల? యెవఁడు ముల్లోకములకును దల్లియుఁ, దండ్రియు దైవమును, సోదరుఁడును, మిత్రుఁడును, దానయై రక్షించుచున్నాఁడో యట్టివాఁడవు నీవకాదే? ఈ జంతుజాలము నీ విల

సితము కాదే ? నీ వేరూపుఁ గోరిన నారూపు నీకు వచ్చు ననుట కీ కిరాతరూపము సాక్షి గాదే? నిగ్రహానుగ్రహసమర్థుఁడ వనుటకు బాలిశుఁడనగు నన్నుఁ గాచుట సాక్షిగాదే? జితేంద్రి యుఁడవనుటకుఁ ననంగుఁడు సాక్షి గాఁడే? నీవాశ్రితరక్షణావై యిడుముల గుడుచుచున్నావనుటకు నేసాక్షినిగానే? అహాహా! నీమహిమలఁ బొగడుటకు నేనా సమర్థుఁడను ? త్రిలోకవంది తుఁడవగు నీవు నాకు యోగిజనదుర్లభమగు నీ రూపమును జూపి నన్ను ధన్యతముని జేసితివి. ఇదియచాలు. నేనింత కెక్కు వరమును వేడఁగలనే ? నీదర్శనసుఖము దప్ప వేరొండువరము నాకొకటి యున్నదే ? ఇంత యెక్కుడు వరమును గోరుటకు నేనంతయవివేకినే ? నీదర్శనమున నాయజ్ఞానతిమిరము చెల్లా చెదరై పోయినది. ఇక నన్ను నీ సాయుజ్య సుఖభాజనునిగఁ జేయు" మని వేడ నంబికారాజు "వత్సా ! ఫల్గున ! నీగోరిన వరము నీ జన్మమున నీయఁజాలను. నీవు జ్ఞాతి వధను జేయ సమకట్టి యీ తపమును జేసితివి. కాన నీకు మదీయపాశుపత మును గటాక్షించెదఁ జేకొనుము. దీన నీయీప్సితము నెర వేరఁగలదు. మఱియు లోకమున దీనిచే ఖ్యాతినందగలవు. నీ మనముగూడ ధర్మప్రవర్తకమై యుండఁగలదు. నీవు భావి జన్మమునఁ గిరాతుఁడవై యుద్భవించి సువర్ణముఖీ ప్రాంతమున గల నా లింగమును జిరకాలము సేవించి యపుడు నా సాయుజ్య సామ్రాజ్యమునుబొందగలవు. ఇప్పుడింతటితో సంతసించిపోయి.

శత్రుసంహారముం గావించి సామ్రాజ్యసుఖముల నవ్వారిగఁ బొందుము. పొమ్మని సెలవిచ్చి యమరులును, గిరిజయుఁ బ్రమథవరులును, సేవించుచుండ వృషభారూఢుఁడై కైలాసమునకుఁ బోయెను. విజయుఁడు సఫలీకృత మనోరథుఁడై యీశ్వర మహిమలఁ దలఁచుకొని సంతసించుచు ధర్మజుని ప్రాపుఁజేరె. కొన్నినాళ్ళకు దమకును, గౌరవులకును జరిగిన సంగ్రామంబునఁ గృష్ణసహాయుఁడై పార్థుఁడీశ్వర దత్త పాశుపతమున వైరికులాటవీ దహనముం గావించి జ్యేష్ఠుఁడగు ధర్మజునిఁ గురురాజ్య సింహాసనమున నభిషిక్తునిఁ జేసి తాను స్వతేజమును వీడి యీశ్వర సాయుజ్య సామ్రాజ్యమును గోరుచుండెను.

మొదటి ప్రకరణము సమాప్తము.



# తిసప్తాంశు.

## రెండవ ప్రకరణము.

శ్రీలం జెన్నొంది ప్రసిద్ధిఁజెందిన యీ భరతఖండంబునఁ గల పొత్తపినాటిలో నుడుమూరను పత్తన లలామంబొంపు విలసిల్లుచుండెను. అయ్యది తొల్లి కిరాతులకు వాసభూతమై విరాజిల్లుచుండెను. దాని సంపదయు, రామణీయకమును నెన్న నా నలువకైనను దరముగాకుండె. అందలి చెంచెతలనవరతము సర్వసంపదలఁ దులఁదూఁగుచుఁ గుబేరునిఁగూడ ధిక్కరించుచు వరాహ విషాణముల దొరకు ముత్తియములను రేఁగుబండ్లవలెను, ఫణిసర్పముల దొరకు ముత్తియములను గురువిందలట్లును, మదకుంభికుంభజములగు వానినుసిరికికాయలవలెను, వంశజాతములగు నాణిపూసల నూడుగుబండ్లవలెను జూచుచుఁ జందనాగరు కాష్ఠంబుల వంటకట్టియలుగఁ జేసి కిరాతులఁ గూడి కాఁపురములఁ జేయుచుండ్రు. మఱియు నా వనితలు ప్రత్యూషకాలమునఁ బునుఁగు జాదు కస్తూరి ప్రభృతి సుగంధద్రవ్యముల నీటఁగలిపి వాకిళ్ళఁ జల్లుచుండ్రు.

ఇట్టి మహైశ్వర్యంబున నోలలాడుచుండిన వారు పట్టుచీరెలఁ గట్ట శక్తులయ్యుఁ బాఱుటాకులనే కట్టుచు, శాల్యాన్నమును భుజింప నర్హులయ్యు వన్యధాన్యములనే తినుచు, మణిహారములనుధరింప వలంతులయ్యు,గురివిందహారములనే ధరించుచుఁ దూఁగుటుయ్యేలల విహరింప సమర్థులయ్యుఁ బూఁదీగటుయ్యేలలయందే విహరించుచుఁ దమకుఁ గల సంపదను గణింపక కులాగతాచారములఁ బాలింప నుత్సుకులై కాఁపురంబులఁ జేయుచుండెడివారు.

సీ. స్తబ్ధరోమ విషాణ ♦ లబ్ధమౌక్తికముల
బాటింపుదురు రేఁగుఁ ♦ బండ్లపాటి
ముక్తకంచుక మస్త ♦ ముక్తాఫలంబుల
మందలింతురు గురు ♦ విందలట్లు
సమదసామజకుంభ ♦ జములైన ముత్తియం
బులఁజూతు రుసిరికా ♦ యల విధమున
వేణుజాతములైన ♦ యాణిపూసల నెంతు
రూడుగపండ్లకు ♦ సీడుగాఁగ

తే. గంధ సారాగరుద్రమ ♦ కాష్టఖండ
చయము తమ యింటివంటక ♦ ట్టియలుగాఁగఁ
జేయుదురు కాఁపురంబులు ♦ సేయునపుడు
చెంచెతలు చెంచులను గూడి ♦ చిత్రలీల.

సీ. పట్టు చీరెలఁగట్ట ♦ భాగ్యంబుగల్గియుఁ
బాహుటాకులఁ గట్ట ♦ భారమనరు
రాజాన్నభోజన ♦ ప్రాభవ శ్రీ గల్గి
యును వన్యధాన్యంబు ♦ నొల్లమనరు
మాణిక్యభూషా స ♦ మాజంబు గల్గియు
నెఱ్ఱని గురువింద ♦ లేటికనరు
మంచిమెచ్చుల తూఁగు ♦ మంచముల్గల్గియుఁ
జాలుఁబూఁదీఁగ యు ♦ య్యాల లనరు
తే. ఎంత సంపదగల్గియుఁ ♦ నెట్టివారుఁ
దమ కులాగత ధర్మ క ♦ ర్మములు విడువఁ
జాలరటు కాన దత్పురీ ♦ శబరనతులు
మహిమ గలిగియు మానరు ♦ సహజవృత్తి.

ఇఁకఁ గిరాతులు తమ సస్యములకు దృష్టిదోషంబు లేకుండఁ బిడిబొమ్మలను, గజశిరములను, నగరు కఱ్ఱలను ప్రేలాడ గట్టుచుండ్రు. శబరవనితలు తమ సస్యములఁ బిట్టలు దినకుండ మంచెలనెక్కి విల్లునమ్ములధరించి కాపాడుచుఁ దమ తమ నాథుల మనముల రంజింపుచుఁ దదానీతములగుఁ గఱ కుట్లను బుట్టతేనియ ముంచి తినుచు మద్యపానములఁ జేయుచుఁ బలువిధంబులఁ గ్రీడించుచుఁ గుసుమబాణుని పరాక్రమమును ధిక్కరించి కాఁపురంబులఁ జేయుచుండిరి.

## నాథనాథుఁడు

ఇట్లఖిలసంపదలఁ దులఁదూగు నాపత్తన లలామంబు నకు సింగపుఁ గొదమల నిరసించు పరాక్రమంబును, మదగజ నికాయంబుల నక్రమంబుగ సంహరింపగల బాహుబలసంపదయు, మృగగణంబుల నిరసించు జవసంపదయు, సివంగిప్రభృతి మృగంబుగంబుల గర్వం బగర్వంబు గావించునంతటి ప్రతాప మును నిఖిలజంతు ప్రాణాపహారంబగు గోదండంబును గలిగి నాథ నాథుఁడను గిరాతుఁ డధీశ్వరుఁడై యుండెను.

సీ. తన విక్రమక్రమ ♦ దర్పంబు హర్యక్ష్య
శిక్షావిచక్షణా ♦ క్షీణగరిమ
తన బాహుబలము కాం ♦ తార దంతావళ
దయితానవీనమై ♦ ధవ్యాకరము
తనజవంబు కురంగ ♦ దంపతీపుంజాజ
వంజవభంజనా ♦ ఖంజయశము
తనప్రతాపము మృగా ♦ దన సార్వభౌమదు
ర్వార గర్వాపహా ♦ దారుణంబు
తే. గాఁగ నానామృగ ప్రాణ ♦ గంధవాహ
వంద శూలేంద్ర నారాచ ♦ బృందవర్ష
కంధరోద్దండ కోదండ ♦ కరుఁడు మించె
నాథనాథుం డరణ్య భూ ♦ నాథుఁ డగుచు.

ఆతఁడు జన్మచేఁ గిరాతుఁడయ్యు సురూప విభవ వితరణ మానములయందు మన్మథ కుబేర కర్ణ రాజరాజులఁ బోలి తనయశము నలుదెసల వ్యాపింప నలరారుచుండెను. మఱియు నాథనాథుని యాధిపత్యమున గిరాతులు రాజభక్తి ధేరేయులును, కృతజ్ఞులును, సత్యవాదులును, పరదార పరధనచింతా విదూరులును, పరనిందా దూరులును, నిర్మత్సరులును, వితరణ శీలురును, బలాక్రమ సంపన్నులును, జితేంద్రియులు నై యుండి రాజునకుఁ జేదోడు వాఁదోడుగ నుండిరి. నాథనాథుఁడు తన కమిత సంపదయున్నను గులాగత ధర్మముల వీడ నేరక పాఱుటాకులనే కట్టుచు, వన్యధాన్యములనే మెసంగుచు గురువిందలనే హారములుగ వినియోగించుచుఁ బూఁదీఁగె టుయ్యేలలు విహరించుచుఁ నజాతశత్రుఁడను బిరుదమును సముపార్జించి లోకాగ్రగణ్యుఁడై యుండెను. ఆతని రాజ్యకాలమున జనులు నిరోగులే కాని రోగులు లేరు. సత్యవాదులే కాని యసత్యవాదు లెందును లేరు. ధర్మనిరతులే కాని యధర్మపరులు కారు. రాజభక్తిపరులే కాని రాజభక్తి విదూరులు కారు. సత్కార్యాచరణ లాలసులే కాని యసత్కార్యపరులు కారు. వితరణ రణశాలురే కాని యాచకలు లేరుగదా? ఇంకను క్షామమునకు దారిద్ర్యమే కదా? ఈతిబాధలకుఁ గరువే కదా! దరిద్రతా గుణమునందే దారిద్ర్యముకాని మఱియొండు చోట లేదుగదా! వేయేల! ప్రణయకలహము లేకాని కల

హాములులేవు. మఱియొక విశేష మా పత్త్రమునఁ గలదు. ఎటఁ జూచినను శివలింగములే యగపడును. ఎటువినినను శైవభాషణములే వినఁబడు. ఎటఁ దిరిగినను శివపూజాధురంధరులేయక్షి గతులగుదురు. ఇట్టి సంపద నలరారు నాధనాధుని గుణగణంబుల వాకొన నెవరు శక్తులు ?

—♦ తంబె ♦—

ఇఁక సర్వగుణ సౌభాగ్యంబుల నాధనాధునకు సరియైరూపమున లక్ష్మీదేవిని, క్షమాగుణంబున ధరాకాంతను, పాతివ్రత్యమున సీతామతల్లిని, భక్తిని గాత్యాయినీ దేవినిఁ బోలి సావిత్రీ, దమయంతీ,ప్రభృతి మానవతీలలామల నేవిషయమునను సరకుఁగొనక తంబెయను నామంబునఁ బరగుచు "తంబె" నాధనాధుని యర్ధాంగిలక్ష్మియై యాతని సర్వవిధంబుల సంతోషపఱచుచుండెను. పురుషులకు యుక్తమైన కళత్ర ముండిన నంతకంటె నెక్కుడుభాగ్యము లోకమున వేరొకటి యుండునే? దాంపత్య విషయమున మహాకవియగు భవభూతి

"అద్వైతం సుఖదుఃఖయోరనుగతం సర్వాస్వవస్థాసుయ ।
ద్విశ్రామోహృదయస్యయత్రజరసాయస్మిన్నహార్యోరసః ।
కాలేనావరణాత్యయాత్పరిణతేయత్ప్రేమసారేస్థితం ।
భద్రంతస్యసుమానుషస్యకథమప్యేకం హితత్ప్రార్థ్యతే"

చెప్పినచొప్పు నాధనాధునియందే సార్థకమగుచున్నది. నాధనాధుఁడు తంబెంగూడి యమితోపభోగంబుల నందుచుండ

నీశ్వరానుగ్రహంబునఁ దండె యంతర్వత్నియయ్యెను. అంత నాథనాథుఁ డమితానంద పరవశుఁడై పుత్రముఖ దిదృక్షు దినంబులు గడపుచుండె. తండె నిజోదరమున వృద్ధిఁజెందు చున్న బాలుని గుధిగణంబులఁ దెల్పెడు కరణి సింహవ్యాఘ్రా దులఁ జంపుటకును, సువర్ణముఖీసైకతంబుల హరునిఁ బూజిం చుటకును, బుక్కిట జలంబుల నుమానాథుని స్నానముఁజేయిం చుటకును, గిటిమాంసఖండంబులఁ దొప్పలఁబెట్టి కాటిఱేని కర్పించుటకును, నయనోత్పలంబులఁ గరళకంఠునిఁ బూజించు టకును, జింతించుచుఁ బ్రొద్దులు సలుపుచుండెను. ఇటుల దినం బులఁ గడపుచుఁ దండె గర్భభారాలసయై గృహకృత్యములఁ జూచుటకును, వెంపుడు చిల్కకుఁ బల్కులు సెప్పుటకును, భూషణంబుల ధరించుటకును, నసమర్థయైయుండె. చెంచెతలు తమరాణికిఁ బ్రసవసమయ మాసన్నమగుడు ససంభ్రమహృద యారవిందలై తగుయత్నములం జేసి యామెను బ్రసవోచిత ప్రదేశమున నుంచిరి. అంతనామె యొక శుభదివసంబున శుభ లక్షణోపేతుం గుమారుం గనియె. తోడనే పౌరకాంతలు నాభి చ్ఛేదముం జేసి నీళ్ళార్చి యాముదముంబట్టి పాన్పుపైఁ బవ్వ ళింపఁజేసిరి. మఱియుఁ బుట్టింట శిశువునకు రక్షగా నందందుఁ గొన్నియోషధులనుంచి తమఱేని కా శుభవార్తఁ దెలియఁ జేయ నాథనాథుఁ డానందాబ్ధి నోలలాడుచు గులాచారము ననుసరించి గొప్పయుత్సవముం జేసి సర్వవిధంబులఁ దిన్నగనుంచు

టం జేసితిన్నఁడను నామంబిడెను. పిమ్మట దాదులాతనిని రక్షించుచుండ బాలుఁడు క్రమక్రమముగ నభివృద్ధిఁ జెందుచుఁ దనకుఁ గల శివభక్తిని జూపుచు నడుగిడసాగెను. తలిదండ్రులా బాలుని సంపూర్ణవాత్సల్యమునఁ జూచుచుండ బాలుఁడు ముద్దులొలుకు పలుకులఁ బలుక నారంభించెను.

## —♦ తిన్నని శైశవము. ♦—

తిన్నఁడు దినదినాభివృద్ధి నందుచు ముద్దులొలుకుఁ బలుకుల, గజ్జలందియలు మ్రోయు నడకలఁ దలిదండ్రుల కానందముఁ గలుగఁ జేయుచు వారి యుత్సంగముల స్వగాత్రమాలిన్యముచే మాగుడుపడఁ జేయుచుండెను. లోకమునఁ బుత్త్రిలెట్టి వారైనను దలిదండ్రులు వారిని గారాబమునఁ జూచుట స్వభావమే కదా? అట్టిసన్నివేశమునఁ దిన్నని సురూపసంపదయుఁ, జిన్నతనంపుఁ జేష్టలును, బరుల హృదయములనే యాకర్షించుచుండఁ దలిదండ్రుల హృదయముల నాకర్షించుననుటలో నతిశయోక్తి యుండునే? మఱియుఁ దిన్నఁడు పరంపరాభివృద్ధి నొందుకొలఁది నాతని శివభక్తియుఁ, బ్రజల కాతనియెడ ననురాగమును, దలిదండ్రులకుఁ బుత్త్రవాత్సల్యమును, భృత్యజనులకాతనియెడ భక్తియు వృద్ధికాఁజొచ్చినవి. ఆడింభకుఁ డనుదినము తనతోడి బాలురఁ గూడి వనములకేగి యటఁ గల సత్వంబుల సంహరించి వానిని గాల్చి కాల్చి రుచి కల్పించుచు మిగిలిన వానిని సంగడీండ్రను గలిసి భుజించుచుఁ

దత్ప్రాంత సైకతంబుల స్వజాతి సామాన్యములగు నాటల నాడుచుఁ బాడుచుఁ దాను రాజనియు బాలురు తన్ను సేవించు భృత్యులనియు నితరుల వివాదములఁ దాను దీర్తుననియుఁ జెప్పుచు నడవుల స్వైర సంచారములఁ జేయుచు సాయంతన మగుడుఁ బరివారముతుగూడి యింటికి వచ్చుచుండెడి వాఁడు. పురజనులందఱును చిన్నని బాల్యమున, నాతని గుణగణంబులను, గడుంగడుఁ బ్రశంసించుచు నాథనాథుని సమీపించి "దేవా! కుమారుండు బాల్యమున దినదినాభివృద్ధి నందుచున్నాఁడు. ఇంకను సర్వజన రంజకుఁడై యుండి యే దుండగములును లేక సర్వజనానురాగమునకుఁ బాత్రుఁడైనాఁడు. ఇట్టి సురూప సంపదయుఁ, బ్రశంసనీయ గుణగణంబులును, మీ కొమరుని యందే చూచినారముగాని మఱియెందేనిఁ గనివిని యెఱుంగుదుమే? ఇఁక దేవర యుపేక్షింపక తగు గురువుల నియమించి పిల్లవానికి విద్యను జెప్పించి యచిర కాలములోనే ప్రజాపరిపాలనా దక్షునిగఁ జేయ వేడుచున్నారము. మఱియుఁ జిన్నఁ డెపుడు రాజై మమ్ముల మీపోల్కిఁ బాలించునా యని మేమా బాల గోపాలము చాతకంబులంబుదంబునుగోరు చందానఁ గోరుచున్నారము. దేవా! ఇదియ మావిన్నపము. ఇఁక దేవరచిత్తము మాభాగ్యము" అనివిన్నవించి వినమిత గాత్రులై దండప్రణామంబుల నాచరించి సెలవుం దీసికొని పోయిరి. తోడనే నాథనాథుఁడు తంతెను సమీపించి చిన్నని

గూర్చి ప్రజలకుఁ గల యభిప్రాయమును జెప్పి యామెను సంతుష్టిపఱచెను. తంవెయుఁ దిన్నని సురూప సుగుణ సంపద కును బ్రజలకుఁ దిన్ననిపైఁగల యనురాగమునకును, మిక్కిలి సంతసించి ప్రజలవలె నామెయుఁ దనూజుని విద్యాపారం గతునిఁ జేసి రాజ్యభారవహనక్షమునిగఁ జేయ వేఁడెను.

## —♦ తిన్నని విద్యాభ్యాసము ♦—

నాథనాథుఁడు ప్రజలయొక్కయు, భార్యయొక్కయు మనోరథములను గనుగొని యమితానందము నందినాఁడు. భీష్ముఁడు పార్థునిఁ వీరాధివీరునిఁజేయ ద్రోణుని గురువుగ నియమించిన రీతి నిజసుతుని వీరాధివీరునిఁ జేయంగోరి చతు రుఁడగు గురువు నొకని నియమించి యాతని సమీపమునఁ దిన్నని విడెను. నోడనే తిన్నఁడు శ్రీరామచంద్రమూర్తికిని వశిష్టఋషిచంద్రునకును గల సంబంధమిట్టిద యని చెప్పుటకు గావలయు ననుదినము పాదచారియయి గురుని సమీపించి యాతని యభిప్రాయము ననుసరించి యించుకంతయేని రాకొమరుఁ డను రాజసము లేక గురుశుశ్రూషా రతుఁడై తలిదండ్రులను మఱచి తదేకనిష్ఠ ధనుర్విద్య నేర్చుకొనుచుం డెను. గురుఁడు తనయెడఁ దిన్ననికిఁగల భక్తికి నానందించి యాతఁడొనర్చు సపర్యల కెంతయు ముదంబందుచు ద్రోణుఁడు నరునకువలె ధనుర్విద్యా మర్మంబులఁ జెప్పి వీరాధివీరునిగఁ జేసెను. తిన్నఁడభ్యస్త విద్యా కుశలుఁడై నాఁడు గంగాతీర

మునఁ గర్ణుఁడు దనయస్త్ర విద్యాకుశలమును స్వయముగఁ బరీక్షించుకొనినటులఁ దానను సువర్ణముఖీ ప్రాంతమును జేరి యందలి సైకతంబుల సింహవ్యాఘ్రాదులఁ గొట్టుచు నింగి చరించు ఖగంబును ధరసంచరించు మృగంబును నేకలక్ష్యంబు ననే కొట్టుచుండ గురువును బరిజనులు నచ్చెరువందుచు తిన్నఁ డీశ్వరాంశంబున జన్మించెననియు లేనిచో మొఱకులగుఁ దలి దండ్రుల కిట్టి ధనుర్విద్యాకుశలుఁడును, శివ భక్తి పరుఁడును, గలుగుటదుర్లభమని తమలోదామనుకొనుచుండిరి. కిరాతడింభ కుఁడు గురునియు, జనులయుననుగ్రహపాత్రుండై తనవిద్యాచా తుర్యమునుజూపుచు జనకులనానందాబ్ధినోలలాడించుచుండెను. తల్లిదండ్రులు తమ భాగధేయంబులకు నానందించుచుండిరి.

## జాతర

అంత గిరాతులు తిన్నని విద్యాసంపదను నాథనాథునకుఁజెప్పనెంచి యాతని సమీపించి వినమితగాత్రులై "దేవా భవత్సూనుం డధీత ధనుర్విద్యా విశారదుండై యౌవనదశ యందుఁ బ్రవేశించెను. దేవర పుత్రుఁడు పరంపరాభివృద్ధి నందిన కొలఁది నాతని గుణగణంబులు నభివృద్ధికిం జొచ్చినవి. మేమేమో చెప్పుచున్నామని దేవర తలంపవలదు. మీతిన్నఁడు పరదారలఁ దల్లులమాడ్కిఁ జూచుచుండు, పరధనంబుల విషతుల్యముగఁ బరిగణించు. ఆత్మస్తుతిపరాఙ్ముఖుఁడును, బరనిందావిదూరుఁడును, నైయొప్పుచున్నాఁడు. పెద్దలఁ

జూచెనేని యనవరతము వారిపదకంజంబులనే సేవింపయత్నించు చుండు. పరులగుణంబులనే సదా కీర్తించుచుండు. దీనులఁ బుత్త్రుల కరణిఁ బోషించుచుండు. కేళి సల్పుటకైనను సత్యము వీడఁడుగదా? స్వప్నమందైననుశివనామస్మరణమును మానఁడు గదా ? శివభక్తులను గనిన మిాఘతుఁడు మైమఱచి వారిం గూడి శివమహాత్మ్యమును గీర్తించుచుండును. నదీప్రాంతముల గూడ శివలింగములఁ బ్రతిష్ఠింపఁ జూచును. తానేసిన మృగ గణంబుల శివునకర్పింపఁజూచును. ఆటలయందును, బాటల యందును శివునిఁ గూర్చియే ముచ్చటించుచుండును. వేయేల! మిాతిన్నఁడు పరోపకారబుద్ధి, శిష్టజనసేవ, ఖలశిక్షణ మున్నగు వానికి బెట్టనికోటయై యొప్పుచున్నవాఁడు. ఏలిక కరుణించి యింకఁ దిన్న నభిషిక్తునిఁజేసి కాటిజేనిపూజకనుపుఁ”డని విన్న వించిరి.

నాథనాథుఁడు తన పరిజనులవలనఁ దిన్ననివిద్యావినయ వివేకాదులఁ దెలిసికొని మనమున నానందించి కాటేని పూజకు వలయు సంభారముల సేకరింపఁ జాటింపుఁడని నిజ పరివారమున కాజ్ఞాపించెను. తోడనే ససంభ్రమ హృదయులై కిరాతులు పట్టణంబంతయుఁ గాటిజేనిజాతర మరునటి మంగళ వారమని చాటిరి. పౌరకాంత లా వార్తను విని యమి తానంద వివశలై తమతమ గృహంబుల యథోచితంబుగ నలంకరించి పచ్చికస్తురి, జవ్వాది, యడవి పసుపుఁ బూఁతలు,

మున్నగునవి స్వగాత్రంబుల విలసిల్లుచుండఁ బరిశుద్ధంబుగ వార్చిన నివ్వరి బియ్యంపు భాండంబులును, జమరీమృగంబుల పాలకనువగు గుమ్మకుంబాళ్ల పాయస భాండంబులును, గీచక తండులంబులఁ గొట్టి పిండిచేసి యావించిన కుడుముల గూన లును, బాగుగ నుడికిన యాకుఁగూరలును, గమ్మవాసనల వాసించుఁ గాయగూరలును, బలువిధ మాంసభాండంబులును, ఇప్ప, తాడి, గిఱుకతాడి, తండులంబులఁగలుగుమద్యకలశంబు లును, గంపలఁ గావిళ్లఁ బెట్టి పట్టుకొని కాటిరాజునకు బలి చెఱుకుటకై వలయుఁ గాననమృగంబులను సంపాదించి కరతాళ ధ్వనులును, వీణాధ్వనుల మేళవించి షడ్జమ స్వరంబునఁ బాడు చెంచెతల గానరవంబులును, గొమ్ములనూఁదుఁ జెంచులకోలా హలంబులును, జెలంగ మహావిభవంబున కాటిరాజు గుడికిఁ బోయిరి.

—◆ తిన్నఁడు మూకాంతుని బూజించుట ◆—

అంత నాథనాథుఁడును దండెయును గూడ నేగి యం దొకదినముండి మరుసటి దినంబున నటనుండు సెలయేట స్నానమాడి ధౌతవస్త్రపరిధానులై చతురలంకారములం దాల్చి ముదంబునఁ బుత్త్రునిరావించి యాతని కభ్యంగస్నాన ముం జేయించి విభూతిస్నానంబును, వనమాలికావలయంబును బెట్టి కాకపక్షంబుల బిసకాండంబులం జుట్టి సహజంబులగు భూషణంబులు వెట్టి బూజసేయంబంపి కుమారుని యువయువ

సౌష్ఠవంబును, నాతని నడకలను, నాతఁడు సేయు శివపూజను జూడ నువ్విళ్లూరుచు వెనుకనడువఁ దిన్నఁ డనన్యసామాన్య రూపరేఖా విరాజమానుఁడై విల్లునమ్ములు పూని తలిదండ్రుల మనంబుల కానంద మంకురింప శివాలయముం బ్రవేశించి శివానాథుని సమీపమ్మున ధనురాది సాధనములవీడి రక్త సుమంబుల, రక్తచందంబున, నివ్వరిపాలల, గుగ్గిలంపుఁబొగ, బునుగుజాదు ప్రభృతి సుగంధద్రవ్యంబుల, జోతుల, బలు విధోపచారంబులఁ గాన్కలఁ గిరాతులు తన్ను సేవించుచుండ నుమానాథుని బూజించి జనకులంగలిసి బలినిచ్చి భక్తి విశే షంబు మెఱయ ననేక విధంబులం బ్రణుతించి శబరులఁ గూడి యానందంబున నన్నపానంబులఁ దనియుచుండె. ఆ సమయంబునఁ జెంచెతలు తమకాదినంబు పండుగదినంబౌటఁ దాము దెచ్చిన మద్యభాండంబులఁగల మద్యమును నిజనాథు లతో సేవించి యుపహార భాండంబులఁగల పెఱవిధ భక్ష్యం బుల నాపోవమెక్కుచు నొకళ్లొకళ్ళపై బడుచు నొడలెఱుం గని వారును, వారువీరనక తలపడి కొట్టుకొనుచు స్త్రీపుంవ ద్భేదంబులఁ బాటింపక యాడుచుఁ బాడుచు నిద్రించువారును లేచి మద్యభాండంబుల వెదకుచుఁ బలువిధములఁ గ్రీడించువారు నై యుండ నాధనాథుండును, దండెయునుదమపరివారము సేయు కోలాహలంబున కెంతయు మనంబున నానందించి తామందందు విహరించుచుండ శబరపూఁబోండ్లమాడ్కి తానునునిజనాథునిఁ

గలిసి విహరించు వేడుక నపరదిక్కాంత యలంకరించుకొని రమ్మనుటచేఁ గావలయుఁ బద్మబాంధవుఁడు నిజనాయికం గూడనేగె. పాపము! ప్రబలశత్రుబాధి కోడి మెటనో డాఁగి యుండిన తమస్సంతతి యిపుడు తన కను వగుటఁబట్టి రానున్న యాపదకై యించుకేనియుఁ బ్రతీకారమును జింతింపక తోడ్తో నన్ని దిశల వ్యాపించె. జారచోరులును దమకు సమయము చిక్కుటంజేసి స్వవ్యాపారముల జక్కఁబెట్టుకొనుటకై బయలు దేరిరి. చిరకాలమునుండి తన విరహంబునఁ గుందుఁ గుముదంబులు మోదంబునందుచుండఁగను, జారచోరులు దమ గుండెలు ఝల్లుమన నెందేని బాఱుచుండఁగను, విరహిజనులు తన్ను నిందించుచుండఁగను, రజనీనాథుఁడరుదెంచె. ఆ సన్నివేశమున మద్యపానంబున నొడలెఱుంగక వివశులై పడియున్న శబరదంపతులు శీతకిరణ సముదాయము తమ మీఁదఁబడ లేచి యింకను బడియుండిన వారిని లేపుచుఁ దమతమ సరకులఁ గైకొని ప్రయాణోన్ముఖులై యుండఁ దిన్నఁడి మొదలు కానలఁగల ఘోరసత్వంబుల ఖండింపఁగలాఁడని తెలుపు వార్తాహరుని మాడ్కి వేఁగుజుక్క యరుగుఁదెంచె. తోడనే నిజనాయికతో డితని విచారించి తిన్నఁ డీరీతి మిమ్ము ముందు పరితపింపఁజేయఁ గలఁడని దుష్టసత్త్వంబులకుఁ జెప్పుటకో యనునట్లు వాఁడికిరణంబుల మున్నిడుకొని పద్మబాంధవుఁ డుదయాద్రి నలంకరించెను. ఆసమయంబునకె నాథనాథుఁడు పరివారముతోడ బురికేఁగి

యమహాన్మఖోచిత కృత్యంబులఁ గావించుకొని నిజసుతుని వేటకుఁ బంపు వేడుక తనమనంబునఁ దూగాడుచుండఁ దగు పరివారంబుల నమ్యోసాధనంబులఁ బట్టుకొని తిన్నని వెంటఁబో నాజ్ఞనొసంగి సింగపుఁగొదమలనేని యవలీలఁ బరిమార్పఁగల వేఁటకుక్కల నిచ్చి నిజసుతునిఁ గానకంపెను.

## —♦ తిన్నని వేఁట. ♦—

తిన్నఁడా యాయిమృగయాసాధనంబులఁ గొని శబరులు తన్ననుసరించి రా నడవికేగి మృగకుల సంయుతంబగు వేంకటాచలమువంకం జెంకి వెట్టుకొనియుండి విక్రమించి తెర వేఁటను మృగంబుల నొకనాఁడు కొట్టుచు సారమేయంబుల సహాయమున స్తబ్ధరోమంబుల బీచంబణంచుచు నొకసారి వలలనేసి పులుఁగులఁ బట్టుచు మఱియొకతూఱి డేగ, మూంగి, సివంగి, యిట్టిమున్నగు వేఁటల యద నెఱింగి యాయాజంతువుల సంహరించుచు నిజపరిచరానీతంబులగు మృగంబులకెద సంతసించుచు నిజబాహుబలంబున సంహరింపఁబడిన పులుల, సింగపు గొదమల, దుప్పుల, సివంగుల, లేళ్ళ, జమరీమృగంబుల, నవ్వారిగ దండిరి కుపాయనంబుగఁబంపె. మఱియు భక్తిపారవశ్యంబున ముందుపడిన మెకమునుగొని దానిని గాల్చి యుమానాథున కర్పించిక్రొవ్విన పందులఁ గమ్మగగాల్చి పరిజనుతేఁదానొకజువ్వి వృక్ష చ్ఛాయ నాశ్రయించి పరిజనులతో స్వేచ్ఛగ భుజింప మొదలిడెను. పరిజనులు తత్రస్థశిలలఁ,బర్ణంబులఁ,బువ్వుల,లతల,

నాసనంబులుగఁ జేకొని తమతేని మున్నిడుకొని యనుదినంబును స్తబ్ధరోమంబుల మాసంబును గుత్తుక బంటిగ మెసంగుచు నా యాయి కొండలఁ గల మృగకులంబుల సంహరించుచుఁ దిన్నని మనంబునకు ముదంబును గలుగఁ జేయుచుండిరి. తిన్నఁడు తన్ను పరివారము సేవింప భృత్యుల మృగయాకౌశలమునకును, దనచేఁగొట్టఁబడి కుప్పకుప్పలుగఁ బడిన మృగకులంబులకును, మనంబున ఘనంబగు నానందంబునుబొంది యింకను దృప్తిఁ జెందక కానల వెదకి మృగకులంబుల ధ్వంసమును గావించుచు శ్రాంతిఁ జెందినవాఁడై యొండొక తావున శ్రమాపనోదముఁ గావించుచుండె. అత్తటి మృగయులు మాటులుగట్టి తాము పన్నిన వలల మృగంబులు వడుటకై యందందుఁ గోలాహలముం జేయుచుఁ జిక్కిన వానిని జంపి చొరనున్న మృగంబుల నేర్పునఁ జంపుచుఁ గానల మృగశూన్యములుగఁ జేయుచుండిరి.

రెండవప్రకరణము సమాప్తము.





# తిన్నఁడు.

## మూఁడవ ప్రకరణము.

### ♦ తిన్నని నిద్ర. ♦

తిన్నఁ డా సన్నేశ్వరసాయుజ్య సామ్రాజ్య ధురంధరుండై యొక సాలవృక్షచ్ఛాయ నాశ్రయించి విశ్రమించియుండ శుఖావహమై యాతని కనుదమ్ముల నిద్రాదేవి యాశ్రయించె. కిరాతకుమారుండు నిద్రాముద్రిత లోచనుండై యొడలెఱుంగక స్వగాత్రసుఖంబునైన సరకుఁగొనక కఠినశిలాతలంబుల నీశ్వరధ్యాన పరవశుండై పరుండియుండెను. ఆ సమయంబున నాతఁడనన్యసామాన్యమగు స్వప్నసుఖంబు నందుచుండ నొక దివ్యపురుషుఁడు నిర్వ్యాజ కరుణా కటాక్షంబున నాతనికి సాక్షాత్కరించెను.

మ. " ఒడలెం దెల్ల విభూతిప్రాఁత పులితో ♦ లొడ్డాణమల్లాడు కెం
జడ లాత్మైకవిచార నిశ్చలదృగ ♦ బ్జాతంబుల చ్చెనక

చ్చఁడ మంసంబునరుండమాలగళదే ♦ శస్త్రావుంఁగాలఁగా
నోడయంఁడొక్కరుఁడక్షుమారుకలలో ♦ నుద్యత్త్రిపాపాణియై.

తోడనే తిన్నఁడు దిగ్భ్రమఁజెంది యూరకుండ దివ్యపురుషుఁడాతనితో "వత్సా! నీ వవివేకివలె నిటు నేలఁ దిరుగుచున్నావు? దీన నీ కేమి లాభమున్నది? ఇదియా నీ భక్తి పారవశ్యము? చిన్ననాటనుండియు హరసాన్నిధ్యమును గోరు నీవు చేయవలసిన పనియా యిది? ఇఁకనైన బాగుపడఁగోరుదు వేని నాబుద్ధివినియిహపర సాధకుండును, వటమూలాశ్రితుండును దాసముంగొంగుబసిండియు, గట్టువిలుతుఁడును, యోగిజనదుర్లభుఁడును, నగు గిరిజాజాని సువర్ణముఖీప్రాంతారణ్యముల వసించుచుండు ఆతని సేవింపు"మని చెప్పి యంతర్హితుఁడయ్యె. అంత నోడలుగదలఁ దిన్నఁడు మేల్కని నలుగడలఁ గలయం జూచుచు నచ్చెరువందుచుండెను.

## —♦ కోలము వీడివచ్చుట. ♦—

ఆసమయంబున శబరులు సింహవ్యాఘ్రాదులం జంపుచు నింకను గొన్నింటిని వలలంబడరొప్పుచుఁ గోలాహలముంజేయుచుండ నేకలంబొకటి వారిచేఁ దరుమంబడి వలంజిక్కియు, వల త్రాళ్లంద్రెంపి నాఁడు హిరణ్యాక్షుని సంహరించుటకై యవతరించిన విష్ణువు ననుకరించి యడ్డువచ్చిన సారమేయంబుల నిజ

దంష్ట్రలఁగొట్టుచు నాజేటకస్త్రలోల్లం ఘనమాచరించి వ్యాధుల యత్నముల విఫలములంజేయుచు ఘుర్ఘురధ్వనుల దిశలు మాఱు మ్రోఱుంగ నెందేనిఁబరువిడుచుండె. అంతఁ దిన్నఁడు తాఁగనిన స్వప్నమునకై యాలోచించుచుండ మృగయులకోలాహలంబులును, వరాహ ఘుర్ఘురధ్వనులును, దనుఁబ్రబోధింప లేచి కాసెబిగించి ధనుర్బాణంబులధరించి వలలఁదప్పించుకొని పోవు వరాహమును దఱుముచుఁబరువిడనారంభించెను. పందియు, దన్ననుసరించి వచ్చుచుండిన కిరాత కుమారునకు దొరకకుండ నాతనిఁబలువిధంబులఁద్రిప్పి యొకచో శ్రాంతిఁజెందిన దానివలె డాఁగి కిరాతుఁడు సమీపించియే యసమకట్టుఁడుఁ బరువిడుచు నొకచో నిలిచి రమ్మని పిలుచుదానివలె నటించుచు నాతఁడు పరువిడినఁ దానునుఁ బరువిడుచు, నిలిచిన నిలుచుచు, నలసిన యలసినట్లుగపడుచు, నేయంజూచినఁ బరువిడుచుః దాను మాయా వరాహమను బుద్ధిని గలుగఁజేయ నజ్ఞానుఁడగుఁ జెంచుకొమరుఁడు దానిని సామాన్య వరాహముగ నెంచి యది దొరకమింజేసి రోషక్రోధంబులు ముప్పిరిగొన దాని నేయ సమకట్టి తొల్లింటి జవంబున కెక్కుడు జవంబుతోఁ బరువిడఁజొచ్చెను. కోలము తిన్నఁడు విసివి తన్ను వీడమికి నెద నానందించుచు నడవులనుండి యడవులకుఁ ద్రిప్పుచుఁ దుదకు సువర్ణముఖీ ప్రాంతారణ్యమున జువ్వినీడంగల ఈశ్వర లింగమును సమీపించి యటఁ దాను దిరోహితమయ్యెను.

అంత ననతిదూరంబున నిర్మలతరవారిపూరంబును, సారస కహ్లారకుముదములై రివశోభితంబును, రాజహంస విరాజమానంబును, బధికజనపరిశ్రాంతిస్వాపనోదకంబును, మునిజనగాత్రదూషితంబును, నై మద్దెలమ్రోతల ననుకరించు నలలఁ జెన్నొందు సువర్ణముఖిం జూచి ముదితుఁడై యం దవగాహనముం జేసి తత్తైనికతంబుల నాసీనుఁడై కొంతతడవునకుఁ దత్సమీపమున, దీర్ఘతరశాఖోపశోభితంబగు నొక జువ్విన్వృక్షముంజూచి దానిని ప్రమీపించెను. అప్పుడ తాను వరాహమునకై పడిన యాయాసమును, స్ఫురిత స్వప్నవృత్తాంతుఁడై సార్థకముగను, వరాహము తన్నలయించుట యీశ్వర మాయగను దలఁచి యత్తరు మూలాగ్రంబునఁ

శా. "సంతోషంబునఁ గాంచెఁ దిన్నఁడుసమస్తవ్యాపకానంతవే
దంతస్థాపిత చిన్మయాంగమున విద్యాధ్వాంత సంతాన సం
క్రాంతస్వాంత నిశాంత జంతు సుఖమార్గ ప్రాపకాభంగ రు
క్కాంతాపాంగము దివ్యలింగమువివిక్తధ్యేయనిర్లింగమున్.

జూచి తా స్వప్నమునఁ గనిన దివ్యపురుషుఁడు హరుఁడే యనియు, నాతఁడు వరాహరూపంబునఁ దన్ను స్వసన్నిధిం బొందించె ననియు, నాటితోఁ దన కీశ్వరసాయుజ్యసామ్రాజ్య సుఖము దొరకెననియు నెంచి కడుంగడు సంతసించి కండకిత గాత్రుండును, నుదిత బాష్ప సంకలిత కపోలుండును, గద్గద కంఠుండును నై యా మహాలింగమునకు భక్తియుక్తంబుగ దండప్రణామంబుల నాచరించి నిర్విచార మనస్కుఁడై యా లింగమున కభిముఖుఁగ నిలువంబడియుండె.

మూఁడవ ప్రకరణము సమాప్తము.

---



# తిన్నఁడు.

## నాలవ ప్రకరణము.

—♦ తిన్నఁ డీశ్వరు నుఁడునూరికిఁ బిలుచుట ♦—

తిన్నఁడు కడుబత్తితో శివలింగాభిముఖుఁడై నిలిచి "ఓ లింగమా! సింహ వ్యాఘ్రాది మృగసంకులంబగు నీకొండ తరి సిలు నేలఁగట్టితివి? ఈ జువ్వినీడ నేయాస నాశ్రయించితివి? మఱియు నీ యేటితరి నీవా కొన్న నీ కన్నపానంబుల నిచ్చువా రెవరు? నీ విట నేల వసింపవలయును? నాయట్టి భక్తులు నీకుండ నీవిట్లిడుమల నంద నాయమే? లోకమున నీకెవరును భక్తులు లేకపోయిరా? వారు నీ విట నొంటి వసించుటకు సహించిరే? కట్టా! వారు నీకుఁ దగు వసతిం గల్పింపలేక పోయిరా? నీ వీకానల నెండకును, వర్షమునకును, శీతమునకును సహించి యాకలములఁ దిని మనుచుండ నీభక్తులు సుఖంబుగ నెట్లు మనుచున్నారు? లేక వారు నిన్నుఁ బిలిచినను నీ వీ మృగంబులు దోడుగా నిటనే యుండఁ దలచినాఁడవా?

ఈ కాంతారమున నీ కెవరైనను జుట్టంబులు గలరా ? నీ కిందేదైన నిప్సితముగలదా ? నీ కేదియును లేనిచో నిటనే యుండ నెందుల కంగీకరించినాఁడవు ? వేయేల ? దేవా ! నీ విట నొంటరిగ నుండజాలవు. నాతో మా యుడుమూరి కష్టచెప్పక రమ్ము. నీవు వచ్చినఁ గొండల, గానలఁ దిరిగి క్రొవ్విన పందులను, లేళ్ళను, దుప్పులను, సంహరించి నేఁ దెచ్చెదను. వానిని మా చిన్నక్క, పెద్దక్కలు కమ్మగ వండి నీ కొసంగుదురు. అటులనే పిట్టలనుగూడ వండి పెట్టుదురు. కావున నాతోఁ దప్పక నీవు రమ్ము. అదియునుగాక శంకరా ! నీవు నాతో వచ్చితేని నివ్వరిప్రాలను, గునుగుంబ్రాలును, వెదురుం బ్రాలును, సవరపు మెకముల పాలును, నీకుఁ బాయసమున కద్వారిగ నిచ్చెద. నీకటఁ బుట్టతేనె, పెరతేనె, పుట్టజున్ను, తొఱ్ఱతేనె మున్నగువానిలో ముంచి జలజలపిండి పోణ్కిరాలు మాంసపుముక్కలను గడుపార భుజింప నొసంగెద. పివాకవేళ వీనిని దిననిచో నేరేడు, నెలయూటి కొండ మామిడి, మున్నగు ఫలంబుల నారగింప నొసంగెద. నీకిటనిల్లు వాకిలియు లేదుగదా! చుట్టములుగూడ లేరే? చెలులు సున్న యేకదా! ఇల్లాలందువా! అదియు నగపడదే? కొడుకులైన నిటఁగనఁబడరే? ఏసుఖమును లేకుండ నీకిటనుండఁదరమే? శంకరా! మాయూరికి నామాటవినిరమ్ము. నీకట నేలోపమును లేకుండఁ జేయుచు, నేనీచరణ దాసుఁడనై యుందును.

శా॥ "ఇల్లో ముంగిలియో యనుంగుఁజెలులో
యీకైనచుట్టంబులో
యిల్లాలో కొడుకో తరింపవశమే
యేపోడుములేక ? మా
పల్లెంగోరిన వెల్లనుంగలవు త్తె
ప్పల్గాఁగ నీకిచ్చెదన్
చెల్లంబోయిట నొంటి నుండకటు వి
చ్చేయంగదే లింగమా !"

నీకెప్పుడు దేనిని గోరినప్పుడ దానిని దెచ్చి యొసంగెద. నీసేవకుఁ బలువుర చెంచెతల నప్పగించెద. నీవు నాయందు వాత్సల్యముం జూపు జేని రా ! లేనిచో నిను వీడి నేఁబోను. నీతోటిదే లోకమనుచు నెంచి నీకరుణను, మానంబును జూచెద. నీకెప్పుడు మనసు వచ్చిన నప్పుడ యిటనుండ మానుదు. నిన్నిపుడు నే నెందులకుఁ గష్టపెట్టవలయును ? నీచిత్తము వచ్చినటులఁ జేయు" మని ప్రార్థించుచుండెను.

—♦ కిరాతుల విచారము ♦—

తిన్నఁడట్లు శివభక్తి పరవశుఁడై యొడలు తెలియక మధుపము మకరందము నాసించి పద్మమును వీడని చందాన నా యీశ్వర లింగము నాశ్రయించియుండ నటఁ గిరాతులు తిన్నఁడు వరాహము వెంటఁబోయి యెప్పటికిని రాకుండుటం

జేసి వచ్చినది యొంటి పందియనియు, నేమి యిక్కట్టు మూడెనో యనియు నెటఁ బోయెననియు, నేరీతి నెటఁ బాధ పడుచున్నాఁడో యనియు, విచారించి భయసంభ్రమాక్రాంత హృదయులై యాతని జాడఁ గనుగొన నెంచి నలువలంకులఁ గలయంజూచి యడుగుల జాడంబట్టి కొండలను, గానలను దాటి యెటెటో శివలింగము నాశ్రయించుకొని యున్న తిన్ననిం గని ముదంబందుచు సమీపమునకుఁ బోయిరి. అటఁ దిన్నఁడు మైమఱచి తదేక ధ్యానమున నీశ్వర ప్రార్థనముఁ జేయుచుండె. ఎంతో సంతసమునఁ గిరాతులు తిన్నని సమీపించినను వాఁడు వారిఁ గన్నులారఁ గాంచకపోవుటం జేసి ఖిన్నులై వారు "అన్నా! తిన్న! నీ వొంటి పందినిఁ దరుముకొని వచ్చి యేమి యిడుమపాటు నందుచున్నావో యని మేము భయమును జెంది నిన్ను వెదకుచు వచ్చినారము. మేమెన్నియో బాధలనందుచుఁ గానలఁ దిరిగి తిరిగి యిటకు వచ్చినను, నీవు మాతో నేలమాటాడవు? మేమెంత దైన్యమును బొందినారమో యని యైన నాలోచింప వైతివిగా? నీ విటుల మాటాడకుండుటకుఁ గతంబెయ్యది? వేఁటలాడ నేతెంచి యింతదనుక ఘోరారణ్యముల మెలఁగుచుండఁ దలిదండ్రులింటఁ గోపింపకుందురే? నీకేటి యీ వెఱ్ఱి? మేమేమన్నను బలుకవేల? అయ్యయో? మేము నీకేమి యెగ్గు గావించినారము? నీవిటులఁ గఠినుఁడవై యుండ మేము మనఁ గలమా? మాకేటిదిక్కు? నీవు పలుకమిం జేసి మా మనంబులు

మిగులఁ బరితపించుచున్నయవి. మాయెడ నీకొకవేళఁ గోపము వచ్చినను నీగాలికిఁ బసివట్టి మాప్రయత్నముల నీటఁగలిపి వేఁటకుక్కలునిన్నుఁజుట్టుముట్టి మహానందమునఁ దోకలాడించుచుండఁ జూడవేమి? వానిని జూడకపోవుటకుఁ బాపము. నోరులేని జంతువులేమి చేసినవి? నీవు మమ్ములఁ దృణకణంబుల మాడ్కి సరకుఁ గొనక మాగతియేమైనదియు నెఱుంగకయిట నొంటరివై యున్నాఁడవు. మేమును నీజాడ నెఱుంగలేకయలయుచు సొలయుచు నిట కేతెంచితిమి. ఎటవేసినవలలటనేయున్నవి. మృగములు వడుటకుఁ గ్రొత్తవలలను బన్నుటలేదు. ఇదివఱకుఁ గొట్టఁబడి చచ్చియుండిన మెకంబులఁ దేలేదు. ఐడివేఁట పిట్టలకు మేత పెట్టలేదు. ఇంతదనుక మృగయావిహారంబున శ్రమపడియుండిన కిరాతుల కాయాస మొక కొంచెమైనను దీరుటలేదు. మెకంబులఁ గాల్చి యుమానాధుని సేవింపలేదు. కుక్కలు, మేపుఁ గొనుటలేదు. మనము చేసిన పనులను దెలుపుచు బాహుబలంబునఁ జంపిన మెకంబులను దండ్రి కుపాయనముగఁ బంపుటయును లేదు. ఇటుల నుండినఁ దండ్రి కోపింపఁడా? విశేషించి ప్రభుసన్నిధిని మాకుఁ దలవంపు ఘటిల్లదా? సకల కార్యంబుల నప్రమత్తులమను మా ఖ్యాతి నీటఁ గలియదా? అయ్యయో! నీ విఁక మమ్ముఁ జీకాకుపెట్టక మా దుఃఖమును బోఁ జేసి మాతోడ రమ్ము. మఱియు నాయనా! తిన్న! నిను వీడిపో మా

మనసొగ్గదు. మీ తోఁబుట్టువులును, చెలులును, దరి దండ్రులును "మీరందఱును రా మాతిన్నఁ డింకను రాలే దేమి?" యని యడుగ మే మేమని చెప్పఁగలారము? మా మేన నసువు లుండునే? పురమున మా ప్రతిష్ఠ నిలువఁగలదా? పిన్నవాఁడ వగు నిన్ను ఁవీడి మేము పురికిఁ బోవ మాకు నలువురిలోఁ దలవంపు ఘటిల్లదే? మమ్మూరక యేల దిట్టించెదు?

శా. "ఓతండ్రీ! నినుడించిపో మనసు మాకొక్కింతగానేర్చునే? మీ తోఁబుట్టులుఁ దల్లిదండ్రులు చెలుల్మీరెల్ల రేతేరఁగా మాతిన్నండిపుడెందు బోయె ననినన్మాప్రాణముల్వోవవే? రా వే తిట్టింపక పల్లెలోన మము దేవే వన్నెయు న్వాసియున్."

కన్నారఁ దేరిఱైనఁ జూడవేల? నీవు రాకున్నచో మాకు జెప్పవలసిన బుద్ధిని జెప్పుము. మేము పోయెదము. మే మీ కాన నీకై నిముషమేని నుండఁజాలము." అనుచుఁ బలుకు పలుకుల నెట్టకేల కాలించి యెలనగ వంకరింపఁ బ్రసన్నుఁడై వారల కిట్లనియె.

—♦ తిన్నఁడు కిరాతులకు సెలవొసంగుట ♦—

చెంచులారా! మీ రేల యూరక వాపోయెదరు? యోగిజన దుర్లభమైన లింగము, తపోనిష్ఠా గరిష్ఠులై యడవుల నా కలముఁలఁ దిని మను ఋషి జనధ్యేయమైన లింగము,

స్వసుఖ పరాఙ్ముఖత నాత్మధ్యానాసక్తి కాముని జంపి జితేంద్రియత్వము వహించిన యీశ్వరలింగము, ముల్లోకముల బెచ్చుపెఱిఁగి పరులను సరకుఁగొనక లోకములఁ జీకాకుపఱచు నసురుల బీచం బణపఁ గొండను విల్లుగఁ జేకొనిన మహేశ్వర లింగము, ప్రాణము పోవునేమో యనియైనఁ జింతింపక హాలాహలముం గంఠమునఁ దాల్చిన మహాలింగము, దక్షాధ్వర ధ్వంసమును గావించి పేరు పొందిన లింగము. అపర్ణాదేవి తపమునకు హృదయమున గడుంగడు ముదంబంది యామెకు మాయావటురూపంబునఁ బ్రత్యక్షమైన లింగము, స్వవంశీయుల ముక్తికై నిద్రాహారముల వీడి తప మాచరించిన భగీరథుని మనమలర వియద్వాహినిని మౌళిం దాల్చిన లింగము, కామినీ రూపమును గైకొనిన వెన్నుని మోహించి తనకుఁ గల శరీర సౌఖ్యమును జూపిన శివలింగము, గజాసురుని సంహరించి యాతనికి ముక్తి నొసంగిన దివ్యలింగము, కాశిని వసించుచు నొకనాఁడు భిక్షదొరకమికై యా మహేశ్వరుని పత్తనమును శపింప నుద్యుక్తుఁడగు వ్యాసునకును, వాని శిష్యులకును జతుర్విధాహారముల నాపోవ నొసంగి కోపపరీత చిత్తుఁడగు వ్యాసుని గాశినుండి తఱిమిన హరలింగము, తన కపకృతిఁ జేయ నెంచి దురహంకారుఁడై కైలాసమును బెకలించి స్వశక్తిని గోల్పోయి రొద సేయు గైకసీ పుత్రునకు సాక్షాత్కరించిన యుత్తమలింగము, భక్తులఁ గాపాడఁ దలఁచి యువత

రించిన లింగము, అనవరతము పితృకాననమున భూత భేతాళాదులు తోడుగా నివసించుచుఁ బుఱికి దండలు, భోగి భోగంబులు, గజచర్మము, మొదలగునవి తన్నలంకరింప నమతో విహరించు లింగము, స్త్రీ విజితుఁ డనుటకు గంగా యుమలకు స్వశిరోగాత్రముల నొసఁగిన యా భూతపతి లింగమునైన యీ లింగ మీ రీతి నే సుఖములును లేక క్షుత్పిపాసలకు లోనై యీ కానగల ఘాతుక మృగంబులు దోడుగా వసించుచున్నయది. ఈ మహాలింగమునకుఁ జేదోడు వాదోడుగ నీ మేను గలంత కాలము నుండఁ దలఁచినాఁడను. మీ కిఁక నాతోఁ బని లేదు. మీ మీ విచారముల బోనాడి మీరు పురికిఁ బొండు. నే రాఁజాల. ఇది ముమ్మాటికి నిశ్చయము. ఈ మహామహుఁడు నావెంట వచ్చెనేని నేను మీతో వచ్చెద. లేనిచో నేనును రాను. ఇది మొదలు గిరిజాజాని యెటనుండిన నటనే యుండువాఁడను గాని యాతని వీడి నిముషమేని మనఁ జాల. వేయేల! శబరులారా! నా కీ దైవమే చుట్టము. ఈ యుమానాథుఁడే నా జనకుఁడు. ఈయపర్ణాకళత్రుఁడే నాతల్లి. ఈగిరిజావల్లభుఁడే నా తోఁ బుట్టువు. ఈగంగాధరుఁడే నాసంగడీఁడు. వీఁడే నాగురుఁడు. వీఁడే నానాథుఁడు. ఇంతకంటె లోకమున నాకు హితులుగాని చుట్టములుగాని లేరు. నాకీతఁడేతోడు. నేనీతనికిఁ దోడై యీ కాననుండఁ దలఁచినాఁడ. మీరిట నాకై యుడుమ పాటుఁ

జెందక నాసాంగత్యమును వీడిపొండు. నన్నిఁకఁ జీకాకుపఱుపక మీరు గదలి పురమునకుఁ బ్రయాణమై కదలుఁడు.

శా. "నాకుంజుట్టము తల్లిదండ్రులు చెలు ♦ ల్నాథుండునీదైవమే
మీకిచ్చోఁబనిలేదు కస్తిపడఁగా ♦ మీపల్లెకుంబొండు కా
రాకూరంబులు చేసినంగదలి నే ♦ రాసచ్ఛటం బ్రాణముల్
పోకార్తుం దుదినాదు వేలుపునకై ♦ బొంకన్నిజంబింతయున్.

నా యీదైవమునకై యసువులనేని యర్పించువాఁడఁ గాని మీతో రానొల్ల. ఇది నానిశ్చయము. మీకు నిజముగ శక్తిగలదేని మీరీదైవమును నాతో నుడుమూరికివిచ్చేయుమని ప్రార్థింపుఁడు. స్వశరీర సుఖములనే యాసింపితిరేని పొండు. మాతలిదండ్రుల నాకై వగవవలదని నుడువుఁడు. మీరీ మృగయా సాధనంబులఁ జేకొనిపోయినఁ బొండు. లేనివో నిట నుండిన నుండుఁడు నాకుమాత్రమిఁక నంతరాయములఁ గల్పింపఁ బోకుఁడు. సత్వరము యిటనుండి పొండు" అని కిరాతులకు సెలవొసంగి తాను మఱల నీశ్వరుని ధ్యానించుచునుండె.

—♦ కిరాతులు తిన్నఁడు రామికి విచారించుట. ♦—

తిన్నఁడు తమ్ము సరకుసేయక పొండని చెప్పినందులకు మిగుల విచారించుచుఁ దిన్నని భక్తిసామర్థ్యములను, నీశ్వర ప్రభావమును, దాము కేవలము మొఱకు జనులగుటం జేసి తెలిసికొనలేక తమలో దామిట్లువగవంజొచ్చిరి. "అయ్యయో!

మనము నెక్కుడినాలనుండియు దిన్నఁడు మనలఁ గాపాడఁ గలఁడనియు, మనకిక నేబాధలు నుండవనియు, సకలసుఖములు జేకూర్చుననియు, నాబాలగోపాలము మనంబుల ఘనంబగు నానందములఁ బొందియుండ మన మనోరథంబుల మంటఁగలిపి యేద్రోహాత్ములుమాలిన జాతిని జేకొని కానలనుండఁ దలఁచి నాఁడుగా? కట్టా! ఇఁకఁ దిన్నని మనము ద్రిప్పి యుడుమూరికిఁ దోకొనివచ్చు మహామహులంగానమే? తిన్నఁడు సర్వ సుఖములు నందుచు నిపు డేరీతి నొంటి నుండఁగలఁడు? ఆహా! మన యీ ముద్దుతిన్నఁడు ఘోరకాంతారంబుల నే ఘాతుక మృగముల వాతఁ బడునో కదా! జాతికి దిక్కు లేదని తాను దలఁచెనే కాని తనకు దిక్కు లేదను విచారము వాని మనమున నిసుమంతయు లేదుగదా! సర్వజ్ఞుఁడని మన మెంచి యువ్విళ్లూరుచుండఁ దిన్నఁడు వెఱ్ఱి తిన్నఁడయ్యెనే? అమ్మమ్మ! తిన్నఁ డడవి నొంటి నుండెనని యే మోమున నాథనాథునకు వచింపఁగలము? తన ముద్దుతిన్నఁడు రామిం జేసి నాథనాథుఁ డిఁక నే రీతి మేనఁ బ్రాణంబుల నిలుపఁ గలఁడు? ఆతని దుఃఖము నిఁక నే రీతి మాన్పఁగలారము? తన ముద్దుపట్టి యొంటిఁ జరింప నిచ్చగించని నాథనాథుఁడు, లోకము ననవరతముఁ బ్రియతమమగు వస్తువు తనకు వేఱొండు లేమిం జేసి వెట్టి తిన్నని గాత్రమాలిన్యముచే స్వ గాత్రమునకు మాలిన్యమును సంపాదించు నాథనాథుఁడు, సదా

తన యనుంగుఁ బుత్త్రుని ముద్దులొలుకుఁ బలుకుల జెంబంబున నానందించు నాథనాథుఁడు, సంప్రాప్త యౌవనుఁడగు నిజ సుతునికి రాజ్యము నొసంగి సుఖాన నుండఁ దలఁచిన నాథనాథుఁడు ఇఁక నేరీతి మనల మన్నించు? తిన్ననిత్రోటిదే లోకమనుచు నాతఁడును గానకుఁ బోయియుండును గాఁబోలు? మన కేటి దిక్కు? ఇఁక మనలఁ గాచి రక్షించు రాజరత్న మెవఁ డొదవునో కదా? ఎటులో నాథనాథుఁడు పురుషుఁ డగుటం జేసి పుత్త్రుఁడు రామికై దిగు లందక ధైర్యముగ నుండిన నుండవచ్చును. తొమ్మిదినెలలు మోసి శరీర సౌఖ్యములకు వెలియై పాలసముద్రము శీతకిరణునిఁ గన్నరీతిఁ దిన్ననిఁ గని యమితానందమును బొందుచున్న తండె, సుతుఁ డొంటరిగ నడవుల సంచరింపఁబోయినఁ దుంఖముకుఁజెందు తండె, ప్రజలు తన ముద్దుకొమరుని గుణగణంబులఁ జెప్పుచుండ ముదంబునందు తండె, తిన్నని రాజ్యాభిషిక్తునిఁ జేయఁ గోరుచున్న తండె, "తిన్నఁడు కానల నొంటరిగ నుండె" నని చెప్పినతోడనే యే రీతి నుండఁగలదు? ఆమె పుత్త్రుని జూపుఁ డని మనల నడిగిన నేమి చెప్పఁగలము? మనము గూడఁ దిన్నని యాశ్రయించి వనమునుండి పోవుట లెస్సగాని పురమునకుఁ బోయి "మా తిన్న నొంటిగఁ గాన విడిచి వచ్చిరే" యను నపవాదమునకు సహించుట యుచితముగాదు. అనుచుండ నందుఁ గొందఱు "మన మూరక మూఢులమై యేమేమో యాడుచున్నారము

కాని తిన్నని దృఢభక్తిని గానలేకున్నారమనియుఁ, దిన్నఁడు సామాన్యుఁడు కాఁడనియు, బుట్టిననాటనుండియు నాతఁడు శివునిఁ బూజించుచు నాతనినే తలఁచుచు నాతని సైకతంబులఁ బ్రతిష్ఠింపఁజూచుచుఁ దా నేసిన కోలంబులఁగాల్చి యుమానాథున కీఁదలంచుచు, శివకథా శ్రవణోల్లాసియై సంచరించుచుండ మన మాతఁడు రాజగుననియు, నాతని వలన బాగుపడఁగలమనియు నేమేమో యెంచుచున్నారము. మన బోటి పాపులకు మహామహుఁడగు దిన్నని సహవాసమేల యబ్బును? మహనీయుఁ డగుటం జేసియే తిన్నని కీశ్వరలింగము దొరకినది. మఱియు నా గిరిజా వల్లభుఁడే భక్తవత్సలుఁడై వరాహరూపమునఁ దిన్నని తనయుండుచోటికిఁ గొంపోయెను. లేనిచో నిన్ని పందులు తిన్ననిచే నశ్రమంబుగ సంహరింపబడుచుండ నాతని కా కోల మఱెయ్యెట్లుకాగలదు? దీనికై మనము వగవం బనిలేదు. తిన్నఁడిక నీశ్వరారాధన తత్పరుఁడై యుండి యాతని నిర్వ్యాజ కరుణాకటాక్షమున ఋషిజన దుర్లభములగు పరలోక సుఖములఁ గాంచగలఁడు. మనము నిర్విచారులమై యుండుటయే లెస్స. దీనికిఁ బురజనులును, నాథనాథుఁడును దంచెయు, నించుకేనియు విచారమును జెందరు. మనము తిన్ననిఁ గాన వీడితిమను నపవాదమును గలుగనేరదు. వివేక విదూరుల మగుటం జేసి మన యవివేకమును వెలిఁబుచ్చుచు నేమేమో విచారించుచున్నారము గాని మనయట్టి యవివేకులు

మన పురమున లేరు. కాన మనము లనుండిన విచారముల వీడి మృగయాసాధనములం గైకొని పురమునకుం బదుం"డని తమలోం దామనుకొని పురమునకు నిర్విచారులై పోయిరి.

—♦ పురజనుల యానందము ♦—

శబరులు పురమునం బ్రవేశించి మోముల దైన్యరసముప్పతిల్ల నలువురంజూడనోడి యెటులో తిన్న డీశ్వరలింగము నాశ్రయించి కాన నుండెనని చెప్పి తమతమ యిండ్లం జేరిరి. ఇంతదనుకం దిన్నం డీశ్వర భక్తుండనియు, నాతనిని గన్నతల్లియే తల్లియనియుం, దమకు నట్టి సుతుండు పుట్టిన బాగుండుననియు, నెంచు చెంచు పూంబోండ్లు తిన్నం డీశ్వర సాంగత్యమును గోరి యడవి నుండెనని విని యానందమున మైమఱచి యుండి కొంత తడవునకుం దెలివినంది "అహాహా! మనమేమో యనుకొనుచున్నారము గాని తిన్నం డేమి పుణ్యాత్ముండమ్మా! ఆతనికట—యోగిజన దుర్లభమగు నీశ్వర లింగము దొరకినదట! దానినాశ్రయించి యడవి నున్నాండట. ఆతని నోములు ఫలించెంగా యనువారును, నీశ్వర సేవానిరతుండగుం బుత్త్రునిం గనిన తల్లియే తల్లియను వారును, దీనికి మన తండెమ్మ మనమున నెంతయో సంతసించుచు మనయభిప్రాయమును గనుంగొనంగోరి నివురు గప్పిన నిప్పుక భంగినుండు ననువారును, నొకవేళం దానుఁగూడం దిన్నని వీడనేరక యడవికిం బాపులమగు మనల వీడి పోవునను వారును, అక్కరో! మనవారు గూడం

దిన్నని వీడకయుండిన నిసుమంతయేని మోక్షము దొరకు నేమోకదా! యను వారును, ఆ! యేటి మాటలివి? మన మగవారెక్కడ? తిన్నఁడెక్కడ? ఆతనికిఁగల్లు మోక్షమున వంతుగల్గుట యెక్కడ? యనువారును, చాలునమ్మా! యేటి మోక్షము? పంజువంటి కాపురమును వీడి కానలనుండఁ గోరె దను? చక్కఁగఁ గ్రొవ్విన పందులఁదెచ్చి కాల్చి పుట్టతేనియ ముంచుకుఁ దినుటకంటె మోక్షమింకొకటియున్నదే యను వారును, పెట్టిపుట్టలేదు గనుకఁ దిన్నఁడు వెఱ్ఱితిన్నఁడై కానల దిక్కుమాలిన జాతినిగని పెట్టుకొని యే పోడుముల్లేక యాకల ములకుఁ బాత్రుఁడైనాఁడు. చాలు మీమాటలిఁకఁ గట్టిపెట్టుఁ డను వారును, ఓలమ్మ! మగలన్న నెంతమక్కువో చూచితిరే? వారిని వీడఁజాలక యేవో మనసునకు వచ్చినవెల్ల నాడుచు నీశ్వర లింగమును, దాని నాశ్రయించిన మన తిన్నని నిందింప వచ్చిన మనయీయమ్మల నేమనవచ్చుననువారును, మగలతోటిదే లోకమను మగువలవీడి మనము కానకుఁ బోదుమే? యను వారునునైయుండి తమలోఁ దామాఁగాదనుచు వాను. లాడుచుండ నవ్వార్త నాథనాథునకును, దండెకును, శ్రవణ గోచరమయ్యె.

—♦ నాథనాథ తంచెల యానందము ♦—

పాపము! శబరులు తిన్నఁ డడవినుండెనని చెప్పలేక చెప్పలేక నాథనాథునకుఁ జెప్పిరి. నాథనాథుఁడు పుత్రవాత్స

ర్యమును, శివభక్తియు, దనమనమునఁ జిందులాడుచుండఁ-
గొండొక [redacted]యు ననఁజాలక చిత్రీయమాన గాత్రుఁడై
యుండి [redacted] కరుణాకటాక్షమున నించుక ధైర్యమును
వహించి [redacted] మనోద్రఢిమకును, శివభక్తి విశేషమునకును
నాతనికి రానున్న యీశ్వర సాయుజ్య సామ్రాజ్య సుఖము-
నకును, డెందంబున ఘనంబగు మోదంబునందుచు నిర్విణ్ణులై
యుండిన యనుచరులం జూచి " శబరులారా ! మీ రెందుల-
కూరక చింతిల్లెదరు ? మాతిన్నఁడీశ్వరభక్తుఁడగుట మొదటనే
తెలిసినది. భక్తిపూర్ణ మనస్కుఁడు కావుననే యాతఁడు కాన
నుండె. ఇది మన కానందదాయకమే యగును గాని దుఃఖదా-
యకము కానేరదు. తమ పుత్త్రుఁడు భగవదారాధనఁ జేసి
యనితరసామాన్య సుఖములను బొందుచుండ విచారించుఁ
దలిదండ్రులు లోకమునఁ గలరే ? సుతునిమూలముననే కదా!
జనకులు ముక్తులగుదురు. తులువలగు సుతుల నూఱ్వురం
డుటకంటెఁ దలిదండ్రులకుఁ బరలోక సుఖముల నొడఁగూర్చు
సత్సుతుఁ డొకఁడుండుట మేలుగాదే ? పూర్వము ప్రహ్లాదాది
మహామహులు, దుష్టులును, లోకకంటకులు నగు బితరులకు
శ్రీమన్నారాయణ సాయుజ్యసుఖమును గలుగఁజేయలేదే ?
ఆరీతినే మా తిన్నఁడును, మమ్ముఁ దరింపఁజేయుటకును, దాను
దరించుటకును నెంచి తానడవి నీశ్వరలింగము నారాధించు
చుండెను. దీనికై విచారించు నంతటి మూర్ఖులమా మేము ?

దీనను మాకించుకయు విచారము లేదు. దీనికై మీ మనముల నాటుకొనిన విషాదమును బాయఁదోలుఁడు. [illegible]గ మీ మీ పనులనుండుఁడు" అని చెప్పి వారల [illegible] పంప వేసెను.

పాపము! ముగ్ధహృదయ యగు తండె తన ముద్దు తిన్నని బుద్ధివిశ్చలతకుఁ నెదనించుక విచారించియు మఱలఁ దానను జిన్ననాటినుండియు నీశ్వరసేవా తత్పరయగుటం జేసి విచారమును వీడి తనకు నట్టి యీశ్వరలింగము దొరకిన బాగుండు ననియు దానును శివలింగము నాశ్రయించి నిత్య పూజలఁ జేయుచుండిన ముక్తిసుఖములఁ గాంచఁగల్గుదు ననియు విచారించుచుండెను. పట్టణంపుఁ దీవంబోండ్లు చపల లగుటంజేసి తండెమ్మ హృదయమును బరీక్షింప వచ్చి యామె చుట్టును గూడి తమలోఁ దా మేమేమో గుసగుస లాడు చుండిరి. తండె తన్నుఁ జూడ నేతెంచిన యలరుబోండ్లం గని "యో తీవంబోడులారా! చూచితిరే? మా తిన్నఁ డీశ్వర లింగము నారాధించుచు నరణ్యమున నుండెనట! నేఁడుగా నా నోములు ఫలించె? మా తిన్నఁడు తన భక్తి సామర్థ్యమున మమ్ముఁ గూడ భవసాగరము దాఁటఁ దేల్పఁగలఁడునుడీ! ఆహా! మా భాగ్య మేమని చెప్పుదును. నా జన్మము నేఁడుగా ధన్యతఁ జెందినది. నా కిఁక నే లోపమును లేదు. నే నిప్పుడుగాఁ బుత్త్రవతి నైతిని. ననఁబోడులారా! మీరును మీ మీ భర్తలఁ

గలిసి నిర్వ్యచారంబుగ నుండి యీశ్వర సేవా సమాసాదిత హృదయ సతులం గని యోగిజన దుర్లభమగు గైవల్య సుఖము ందుఁడు. వృధా ప్రసంగముల వలన వచ్చెడి దేమియును దు. మన పాలిటి పెన్నిధి మన కాటిఱేఁడు గలఁడు. ఆతని ననవరతము సేవింపుఁడు. ఆతఁడ మనకు జనకుఁడు. ఆతఁడే జనని. ఆతఁడే సోదరుఁడు. ఆతఁడే యిష్ట బంధుఁడు. ఆతని కెక్కుడు బంధువులు మన కీ లోకమున లేరు. ఆతఁడ మననాథుఁడు. ఆతని నేమఱకసదాధ్యానింపుఁడు. ఇది మొదలు మన ననఁబోఁడ్లలో నెవ రీశ్వరసేవ నాచరింతురో వారే నాచెలులు. వారలఁగూడియే నే ముచ్చటించెదను. మీరు బాగుపడఁగోరుదురేని నామాటల నాలించి కాటినుండు దైవమును సేవించుచు మీమగలు గొట్టితెచ్చిన మృగంబుల బాగుగఁగాల్చి యామహామహుని కర్పించుచుండుఁడు. ఇఁక మీయిండ్లకుఁ బొం”డని సెలవొసంగి పంపివేసె.

## తిన్నఁడు శివునిఁ బూజించుట

పురజనులును, నాథనాథ తంబెలును దిన్నని భావి సుఖంబులఁ దలచి ముదంబు నందుచుండ నటఁ దిన్నఁడు శివుఁడు తనతో నుడుమూరునకు రామింజేసి మనమునఁ గుందియు, నించుక వడికి నదియు నొకలాభమే యనియు నెంచి మనంబున సంతసించి “యయ్యయో! యీమహాస్థియుఁ

పెన్నేండ్లనుండియో యీకానల నిట్లు నిద్రాహారములు లేక కుందుచున్నవాఁడు. నాబోఁటి భక్తుఁడుండియు [illegible] దుఃఖములపాలగుట యుచితమే? ఇఁక నీతని పవి[illegible]ముఖీ జలంబుల స్నానమాడించి యీకాన బలిసియుం[illegible] యేకలములఁగొట్టి బాగుగఁగాల్చి యితని కారగింప నిచ్చెద"నని తలఁచి ధనువుఁ జేకొని కానం బ్రవేశించె. "భవితవ్యానాం ద్వారాణి భవంతి సర్వత్ర" అనునట్లు మహాభక్తులు దేనిని దలఁచినను సుకరముగ నదిలంభించునుగదా? తిన్నఁడు కానం జేరుసరికి వరాహ సముదాయంబులు తమంతటతాము తిన్నని యెదుటంబడినవి. తోడనే చెంచుకొమరుఁడు వాని నశ్రమంబుగఁ జంపి సమిధల నేరితెచ్చి యా మాంసఖండంబుల బాగుగఁ గాల్చి దొప్పలనిడి వానిం జేఁదోయిఁదాల్చి పుక్కిటఁ గాంచముఖీ జలంబుల నుంచుకొని విలునమ్ములఁ జంకనిడుకొని యీశ్వరలింగమును సమీపించి భక్తిగదురఁ జెప్పు గాలితో నిర్మాల్యముం ద్రోసివేసి గండూషజలమున మజ్జనముఁ జేయించి పత్తిరిడి దొప్పలనుండు మాంసపుముక్కల నారగింప నెదుటఁ బెట్టి తాను గ్రేప నొదిగియుండెను. తిన్నని భక్తిని బరీక్షించుటకుఁ గావలయు శివుఁ డామాంసఖండంబుల దినకుండ నూరకుండెను. శివుఁడు తా నొసంగిన మాంసమును తినమిం జేసి కిరాతుఁడు శివునుద్దేశించి "దేవా! నీవు చిరకాలమునుండియుఁ దిండిలేక యున్నాఁడవని కానలఁ బందులఁ గొట్టి కాల్చి తిందు

వను నాసతో, బెట్ట నెందులకుఁ దినవు? ఈ మాంసపు ముక్కలు కాలినవికావా? లేక బాగుగఁ గ్రొవ్విననవి కావో? మాడంగాలిన వో? చవిగా లేవో? కమ్మగ నుండవని తలంచితివే? నీకు జాలియుండలేదా? ముక్కలు నోటం బట్టవా? మఱిగేముల దినవు? ఇందు లోపమేమున్నది? నీ కాకలి కాలేదా? నాకు భక్తి యింకను జాలదా? దయతో నన్ను మన్నించి నీ వీ మాంసమును దినిన నేనును దినియెద. నా కాకలి యగుచున్నది. నిన్ను వీడి కుడువ మన సొల్లకున్నయది. ననుఁ జీకాకు పెట్టక యీ మాంసమును నాపోవం దినుము. యింకను వలయునేని దెచ్చి యొసంగెద. వీనిని గాక నీవు వేనిని గోరిన వాని నన్నిటిని దెచ్చి యొసంగెద. లోపమున్న జెప్పుము. దానిని జక్కపఱచుకొనువాఁడ. నీవు నన్నింత చులకనగ నేలఁ జూచుచున్నాఁడవు? నాయెడ నపరాధమేదేనిఁ గలదే? నీ వుపవాసముతో నుండుటకు గారణమెద్ది? నీ శరీరమున నారోగ్యము లేకున్నదా? నీ కీ వనమున నా కంటె నెవరైనను గలరా? నాకు నీవును, నీకు నేనును దిక్కని యెంచియుండ నీ విటుల నాతో నేమియుఁ బలుకకే యిట్లెందులకు నిరాహారుఁడ వయ్యెదవు? నీ కిటులఁ జేయ న్యాయమా? ఒకవేళ నీ కివి రుచించనిచో పాలు కావలసిన నీ యిచ్చవచ్చిన పాలం దెచ్చెద. పండ్ల నాశించితివేని నీ మనసునకు వచ్చిన పండ్లను నీ కాననుండి తెచ్చి యిచ్చెదను.

వాని నాపోవ నీవు మెసంగవచ్చును. నీ కేవిచారమును లేదు. నీవు నీ యిచ్చవచ్చిన చొప్పున నుండుము. నీకు వలసిన వాని నెప్పుడు కోరిన నప్పుడె తెచ్చి యిచ్చెదను. లెమ్ము. నా మాట వినుము. మాంసమును భుజింపుము" అనుచుఁ బరిపరివిధంబుల నతిదైన్యంబున వేఁడినను నాభక్తవత్సలుఁడు మాంస ఖండంబులఁ గనులారఁ జూడ నొల్లమిం జేసి తిన్నఁడుపాయాంతర శూన్యుఁడై "ఈశ్వరా! నీ వే దినంబున నాయెడ సంపూర్ణ వాత్సల్యముం జూపి యీమాంసఖండములఁ దినవేని నీపదంబులంబడి నాప్రాణములనే విడుచువాఁడ. ఇదినిశ్చయము. నమ్ముము. ఇదె నీపాదములాన" యనుచు నీశ్వరలింగముపైఁబడి మహానిధిం గోలుపోయిన పేద చందంబునను, సుగుణశాలియగు సుతుని గోల్పోయిన జనకుని కరణిని, మృతినందిన భర్తకై విలపించు యువతి చందంబునను, నెత్తి, నోరుఁ గొట్టుకొనుచు వలవలఁ గన్నీటి ధార లేరులై పాఱ నేడువఁ బ్రారంభించెను.

అంత నాశ్రితావన తత్పరుఁడును, నిగర్వ చూడామణియు, హీనజనసేవాభిలాషియు, నగుఁ గాత్యాయనీధవుఁడు ప్రత్యక్షమై "వత్సా! తిన్న! నీవేల విలపించెదు? నీయందిసుమంతయేని లోపములేదు. నీ పూజకు నే మెచ్చితిని. నీయిచ్చిన పదార్థములు నామనసునకు వచ్చినవి. ఇంతఁదనుక నీభక్తి విశేషమును బరిశీలింప నుపేక్షించితిని. కాని

వేఱొండుగాదు. నీవు నాకు హితభక్తుఁడవు. సందియము వలదు. నీవిఁక దుఃఖమును గట్టిపెట్టుము. లేలెమ్ము. కఱకుట్లను దినియెదను. నిర్విచారంబుగ వానిని నాకిమ్ము." అని యమిత వాత్సల్యంబునఁ జెప్పఁ జెంచు కొమరుఁడు లేచి యమితా నంద పరవశుఁడై యాతని యెదుట నిలువఁబడి కఱకుట్ల నందింప నారంభించెను. ఉమానాథుఁడు తిన్నఁడిచ్చు మాంస ఖండంబులం గడుముదంబున నాపోవ మెసంగి లింగాకారుఁడై యుండెను. తత్సన్నివేశంబునకు మోదంబు నందుచుఁ గిరాతుఁడు తానును గఱకుట్లను భుజించెను. అనంతరము పుళిందకుమారుఁ డనుదినముఁ గానలఁ దిరుగుచుఁ గ్రొవ్విన యేకలంబులను, దుప్పులను, వేళ్ళను, గొట్టి తెచ్చి కాల్చి పుట్టతేనియఁ జొప్పించి పరిపక్వ ఫలంబులతోఁ గలిపి యిచ్చు చుండెను. శివుఁడును గిరాతుని భక్తికి నెద నానందించుచుఁ దదానీతిఫలంబులను, గఱకుట్లను, గుత్తుగ బంటిగ మెసంగుచు దినములఁ గడుపుచుండె. పుళింద నందనుఁడు తన్నీశ్వరుఁడు గారవించుటచే సకలమును మఱచి యీశ్వర ద్వితీయుఁడై ఘోర కాంతారంబుల విహరించుచుండె.

నాలవప్రకరణము సమాప్తము.

---



# తిన్నఁడు.

## అయిదవ ప్రకరణము.

### — బ్రాహ్మణుఁ డీశ్వరారాధనమునకు వచ్చుట. —

తిన్నఁడనవరతముఁ గానల సంచరించుచు మృగంబులఁ జంపి పచనముంజేసి యుమాకళత్రునకు భుజింప నిచ్చుచుండ గౌరీవల్లభుఁ డలరి వానిని గడుపార భుజించుచుండెడివాఁడు. ఇటుల జరుగుచుండ నొకనాఁడు భక్తి విశేషంబు మీఱ విభూతి రుద్రాక్షమాలికలును, మణికర్ణికావగాహితశిరమును, నీర్కావిదోవతులును, ధవళయజ్ఞోపవీతములును, నభిషేక భాండంబును, బుష్పకరండకంబును, మెఱయఁ బంచాక్షరీమంత్రమును జపించుచుఁ గాత్యాయినీనాథునిఁ గొల్వ శివబ్రాహ్మణుఁ డొకఁ డరుదెంచె.

సీ. పంచాక్షరీపూత ! భసితత్రిపుండ్రాంకి
తాంకభాగములు ♦ స్నానార్ద్రశిఖయుఁ
గ్రమకృత గ్రంథి సూ ♦ త్ర వ్రాత రుద్రాక్ష
భూషణంబులు శైవ ♦ భాషణములు
నాగుల్భలంబమా ♦ నాంబు శోణంబైన
తోత్రంబు నుపవీత ♦ సూత్రములును
గరగృహీతాభిషే ♦ క క్షీరసంపూర్ణ
భాండంబు పుష్పక ♦ రండకంబుఁ

తే. గుండ బొజ్జయు నొకపాటి ♦ గుజ్జురూపు
నుత్తరీయంబుఁ దనరంగ ♦ యోగిహృదయ
గోచరునిఁ గొల్వ శివచిహ్న ♦ గోచరాంకుఁ
డొకఁడు వచ్చె శివబ్రాహ్మఁ ♦ డోత్తముండు.

వచ్చి ద్విజుఁడు గౌరీశ్వరుని యాలయముం బ్రవేశించి కొలఁది దినములకు మున్ను దా నలికి ముగ్గిడి యలంకరించిన యాలయ మిపు డెంగిలిపుల్లియలనిడియుండుటను, మణికర్ణికా జలంబుల నభిషేచితలింగమున జారికలుండుటను నందందుఁ బలలఖండంబు లుండుటను దాను బూజించిన పత్త్రికి లేకుండుటను, జూచి వివర్ణవదనుండై. "యయ్యయ్యో! నే మొన్న నలికి ముగ్గిడిపోయిన యోజల దీని నెవరిటులఁ బాడుచేసిరి? నిర్మలమైన యీహరలింగము జారికలనేలఁ గలిగియున్నది? ఇట వెంగిలి పుల్లియ లేల వచ్చినవి? నాకిట్టి దుఃఖము నాపా

దించిన మత్తుఁడెవఁడై యుండును ? కట్టా ! నేను గులదైవ మని యెంచి పలువిధముల నీ యాలయమును శుభ్రపఱచి పోవ నిటుల నుండుటకుఁ గారణమేమి ? అహాహా ! లోకాధీశ్వరుఁడగు శంకరుఁడిటుల ధూళిధూసరిత గేహమున వసించి యుండుట తటస్థించినదే ? నా కులదైవమున కిట్లగ్గు గావించిన వాఁడెవరు ? ఇట్టి యపచారముల నే నెట్లు సహింపగలను. దీనికేదేని కారణముండక మానదు. దీని నెటులైన దెలిసికొనవలయును. ఇది మహాదేవునకు విదితమై యుండనోపు. లేనిచోఁ దాను శక్తుఁడయ్యు నిట్టివానికి సహించి యెట్లుండఁ గలఁడు ? లేక నాకంటె నెక్కుడు భక్తుఁడింకెవఁడేని గలఁడా? ఏది యెటులయిన దీని యథార్థమును దెలిసికొనవలయును." అనుచు దేవదేవునుద్దేశించి "శంకరా ! యేటికి నీనిర్మలాంగకము నిటిపట్టులంగలిగియుండె. నీయీపవిత్రగేహము నిటుల నెవరెంగిలి పుల్లియల నలంకరించిరి ? ఈ పలలఖండంబు లిందేటికి వచ్చినవి ? ఈ రోఁతకు నీ వెట్లోర్చినాఁడవు ? నీనిని శుభ్రపఱచినచేతితో మఱల నీ దేహము నంటులకు నాకే యసహ్యమగుచుండ దీనికి నీ వేరీతి సహించినాఁడవు ? దేవా! నేటి కేఁడు దినములయ్యె నీయాలయమును వీడి. ఇదివఱ కెన్నఁడు నిట్టి యనాచారము జరుగలేదే ? నేఁడెందులకుఁ గల్గవలయు ? దీని నెవఁడేని చేసెనా? లేక నాశక్తిని గనుఁగొనఁగోరి నీవేయిటులఁ గావించితివా ? నీకిట్ల నప్పులైన లేనిఁ గలరా ? లేక సుతులుం

డిరా? మాయమ్మయగు గిరిజయే యిటులఁ గావించినదా? నీసేవకు లెవరేని వచ్చి యిటులఁ జేసిరా? దీనిని నీకుఁ దెలియకుండఁ జేయ నెవరు శక్తులగుదురు? నా మనము తల్లడిల్లుచున్నది. వేగ దీనిని జెప్పినామనోవేదన నుడుపుము. అదియుఁగాక శివా! నీయాప్తులే యీయుపచారముం జేసినారని యందువేని నీవనుదినమును శ్మశానమునఁ గదా వసించుచున్నాఁడవు. నీహితులు పిశాచములు గదా! అలంకారము శవభూతిగదా! రక్తసిక్తమగు గజచర్మమేకదా వస్త్రము! భిక్షాపాత్రము పుణికగదా! హారములందువా? మనుజుల పుణికలుకదా! వాహనమో ముసలియెద్దుగదా! తలయేని నిర్మలముగ నున్నదందువా! గంగాసంబంధమునఁ బాకుడు గలిగి యున్నదిగదా! ఇట్టి నీకింకను నెంగిలి పుల్లియలు గావలసివచ్చెనే? లేక రోఁతలు చాలక యీరోఁత కిచ్చగించితివా? అయ్యయో! నీకు సౌఖ్యము నొడఁగూర్పనెంచి యెన్నియో యిడుములఁగుడిచి నేనీ యాలయమును శుభ్రపఱచిపోవ నీవిటులఁ జేయుట న్యాయమే? నీభక్తుఁడు దుఃఖించుటకు నీవంగీకరించితివా? నాయీదుఃఖమును బోఁగొట్టి నీకీరోఁతఁ గల్పించిన వానిని జెప్పితేని నేనిప్పుడ వానిని సంహరింతును. నీకొకవేళ నిది సమ్మతమైనను నాకు మాత్రముగాదుసుమా! నీవా పాపాత్ముని ఁ జెప్పితివేని నేఁబది లక్షలుగ భావింతును. దేవా? లేనిచో నీకై నాప్రాణముల విడుచువాఁడ. ఇదియ నానిశ్చయము. నీలగ్రీవా! నేనిఁక

నీయీయపచారమునకుఁ దాళఁజాల. చెప్పెదవా? లేక ప్రాణ ముల విడుచుమనియెదవా?" యనుచు పొంగి పొరలివచ్చు దుఃఖమును నాపుకొనఁజాలక వెక్కి వెక్కి యా లింగముపైఁ బడి యేడ్వ నారంభించెను.

—♦ శివుఁడు ద్విజుని దుఃఖమును మాన్పుట ♦—

భూమిసురుఁడు ప్రాణముల వీడఁ గృత నిశ్చయుఁడై యుండ, భక్తపరతంత్రుఁడగు గిరిజావల్లభుఁడాతనికిఁ బ్రత్యక్షమై "వత్సా! నీవిట్లేల వగచుచున్నావు? నీవు నాకు నిజముగు భక్తుఁడవు. నీచేసిన సపర్యకు నేనెంతేని సంతసించినాఁడ. నీ లోప మేమియును లేదు. నేను సర్వదా భక్తులు సేయు సపర్యలకెడ సంతసింతును. నా భక్తులు నన్ను నిందించినను, బూజించినను, నాకే యపచారమును గావించినను సహించు వాఁడనే కాని యాగ్రహించువాఁడను గాను. "గుణాఃపూజా స్థానమగుణేషు నచలింగం నచవయః" అను రీతిని ఎవ్వరైనను నిజముగ భక్తితో నన్ను సేవించిన నేను వారిభక్తినే యెంతును గాని జాతిని, గుణములను యెంచను. భక్తిప్రధానుఁడనగు నాకు నా భక్తులు భక్తితో జల మిచ్చినను, దృణ మిచ్చినను, లేక యెంగిలి పుల్లియల నిచ్చినను, నీకున్నను, నే వారి నాదరమునఁ జూచుచు వారు కోరినవెల్ల నొసంగుదును. మఱియు వారితరము నెఱుఁగక నన్నే యనవరతము సేవించు చుండిరేని నేను వారి యోగక్షేమముల నారయుచుందును. నే

వారికి దాసుఁడ నగుదును. అదియునుగాక యే జనుఁడైన నన్నింతకు ముందెప్పుడును సేవింపకున్నను, గుర్తింపలేకపోయినను, గష్టకాలమందేని సమాహితచిత్తుఁడై నన్నుఁగాని, నా నివాసమగు గైలాసమునుగాని, నా వాహన మగు నందినిగాని, నా యీ యాభరణములనుగాని, తలఁచినచో నప్పుడ పోయి వాని యాపదఁ బోఁగొట్టువాఁడ. ఇదియు నా వ్రతము. అనవరతము నితరము నెఱుఁగక నన్నే యాధారముగఁ జేకొని సేవించి ముదంబునందు వారికి నే దాసుఁడ నగుదు నని వేఱుగఁ జెప్పవలయునా? వత్సా! నీవే యధిక భక్తుఁడ వని యేమేమో చెప్పుచున్నాడవు. కాని నాకు నీయట్టి భక్తులు పలువురు గలరు. వారును నీవలెనే నన్నారాధించుచున్నారు. నినుఁ బోలెనే వారి నాదరించి వారి పూజలఁ గైకొనవలదే? లేనిచో నీవలె వారును దుఃఖింపకుందురే? నానియమభంగము గాదా? నీవు నా భక్తుఁడవయ్యు నిట్లు పట్టు పట్టియుండుట యుచితమే? నీకంటె నెక్కుడు భక్తితో నొక కిరాతుఁడు నన్ను సేవించుచున్నాఁడు. వాఁడు జన్మచే హీనకులజుఁడయ్యు భక్తిలో నిరాహారులై కానలఁ జరించు ఋషిజనుల కంటె నధికుఁడని చెప్ప నొప్పును. కావున నేను వాని భక్తికి మెచ్చి వాఁడిచ్చు నాహారమున కిచ్చగించితి. వాఁ డీ యెంగిలి మాంసములను దెచ్చిపెట్టెను. వాఁడు వోసిన నీరే నా యంగమున జారికలు కట్టియున్నది. ఆ కిరాతుఁడు శాస్త్ర

వ్యవహారేతరమతమున నీవలెఁగాక నన్ననుదినముఁ బూజించుచున్నాఁడు. వాఁడు దొప్పల పలలఖండంబుల నిడి పుక్కిళ్ళఁ గాంచనముఖి జలంబులఁ దెచ్చి యభిషేకముఁ గావించి నేను మాంసమును దినిన పిమ్మటఁ దాను భుజించును. నా కొసంగని వస్తువును దాను దిన నొల్లఁడు. వాఁడు సేయు సపర్యలకు నే నంగీకరించి యున్నవాఁడను. దీనికై నీవు మదిం గుందకుము. నీ పచారము నిక్కఁ బాఱఁ ద్రోలుము. లే లెమ్ము. నీ కా కిరాతుని భక్తిని జూడఁ దలంపు గలదేని వాఁడును వచ్చు వేళ యయినది. ఇంచుక తడవిందు డాగి వాఁడు సేయుపూజను జూడుము. అదిగో వాఁడును వచ్చుచున్నాఁడు" అని చెప్పి, తానంతర్హితుండయ్యె. బ్రాహ్మణుఁడును దత్సమీపముననే గుప్తశరీరుఁడై యుండెను.

## —♦ తిన్నఁడీశ్వరునకు గన్ను నొసంగుట. ♦—

బ్రాహ్మణుఁడీశ్వరుని యాజ్ఞ ననుసరించి ప్రచ్ఛన్నముగనుండ వేళ యగుటం జేసి తిన్నఁడు యథాశక్తిఁ గానలఁ జంపిన కోలంబులఁ గాల్చి యామాంసపు ముక్కల దొప్పల నిడుకొని సువర్ణముఖిజలంబులఁ బుక్కిటనుంచుకొని వచ్చి గండూషధారల శివుని స్నానమాడించి నిర్మాల్యమును జెప్పు గాలఁదుడిచి యించుక పత్తిరిడి తాదెచ్చిన మాంసపు దొప్పలనెదుటఁబెట్టి "శివా! చాల దడవైనది. ఇఁక నాలసింపక కఱకుట్ల నారోవం దినుము. వలసిన మఱి కొన్నిటిని దెచ్చి,

యిచ్చెదను. లేలె” మ్మని యూరకుండెను. శివుఁడావేళ తాను దెచ్చిన మాంసమునుదనక యూరకుండుటం జేసి కిరాతుఁడు మది యొకింత విచారించి “యీశ్వరా ! ఏల నాలసించెదవు ? వేళ యతిక్రమించినదే ? ఆకలి యింకను గాలేదా ? ఇంకను వేళకాలేదా ? లేక యివి బాగుగ గాలలేదా ? రోజును మాంసమును దినుచుండుటచే విసుగు పుట్టినదో ? దేవా ? ఏల భుజింపవు ? నామీఁద నీకు గోపమువచ్చినదా ? ఇన్ని నాళ్ళనుండియు దినుచున్నవాడ వీ రోజున నేల దినవు ? నాకాకలి యగుచున్నది. నీకు మాత్రమెందులకు గాదు ? నను జీకాకు పెట్టక వేగదినుము” అనుచు బ్రార్థించెను.

తోడనే యీశ్వరుని గనుదమ్ములనుండి జొట జొట నీరు కారఁజొచ్చినది. అదియు మఱికొంత వడి కధికమై యేరువలెఁ బాఱుచుండఁ జెంచు చూచి “అయ్యయో ! కంటి కేలకో దెబ్బతగిలినది. ఈబాధచే నీక మాయయ్య మాంసమును దిన నొల్లఁడు. నే నిపుడేమి చేయుదును ? మాయయ్య కీ కంటినొప్పి యేరీతిఁ బోవును ? ఈ యడవి యందు మందు సమకూర్చు మహానీయు లెవరైనం దొరకు దురే ? ఇటుఁ గోలంబులు దక్క యితరమేమి గలదు ? నేనిపు డేయుపాయంబున మాయయ్య కంటికి మందు సమ కూర్తు”ననుచుఁ దనమనమునఁ బొంగి పొరలుచున్న దుఃఖము నాపుకొనలేక యెటులనో ధైర్యమును దెచ్చుకొని యాతని

సమీపించి యత్యాతురముతోఁ దనచేలముఁ జుట్టి యూఁది
కాఁచియు, హస్తముల మర్ధించి కాఁచియుఁ దంగేటి రేచ
కాకుల నిమ్మపంటి పులుసున నూఁది పెట్టియు, దెల్లదింపెన
పూరసమును బిడిచియు, గలివెపువ్వుల రసముంచియు, నేయి
పెరుగున ముంచిన వస్త్రులఁ బెట్టియు శంఖచూర్ణమును జను
పాలఁ గలిపి పెట్టియుఁ, దన యెఱింగిన మందుల వెనుఁదీయకఁ
యుపయోగించియుఁ, బరుల నడిగి మఱి కొన్నిటిని దెచ్చి
పెట్టియుఁ, బ్రయోజనముం గానక "అయ్యయ్యో! ఇన్ని
మందులుంచినను బ్రయోజనము లేకపోయెనే ? కంటికి
బ్రమాదము వాటించెఁ గాఁబోలు ? అహహా ! యేమిగతి ?
నా యెఱింగిన మందుల నన్నిటిని పెచ్చి యుంచితిని. ఇంకను
బరుల నడిగి తెచ్చితిని. అయినను లాభము లేకపోయెనే ?
నే నీ దుఃఖము నెటువలె నోర్చువాఁడ ? నే నవివేకినై మందు
లనుచుఁ జూచిన వాని నెల్లఁ దెచ్చి పెట్టితిని. దానం జేసియే
కాఁబోలు. కంటికి ప్రమాదము వాటిల్లినది. హా ! దైవమా !
మా యయ్య కంటి కింక మందు చేకూరదే ? ఇఁక నే నెవరిని
యాచింతును ? మా యమ్మ యయిన లేకపోయెనే ?
అయ్యయ్యో !" యనుచుఁ బలు విధంబుల వెక్కి వెక్కి
యేడ్చుచు నున్నత్తుని చందానఁ గానం బ్రవేశించి "యో
తరులారా ! మా యయ్య కంటికి మీ కేదైన మందు తెలిసి
నేని దయతోఁ జెప్పరే ? యో గిరులారా ! మా యువా

నాథుని కంటికిఁ జికిత్స యొనర్చి కంటి నీరు మాన్పరే? యో శకుంతంబులారా! మీ యెఱింగిన మందు నుపయోగించి మా యీశ్వరుని బాధ మాన్పరే? యో వన దేవతలారా! మీరైన నాయెడఁ గరుణించి మాయగజానాథుని కంటి నొప్పి మాన్పరే? ఇదె మీకు వందనశతంబుల నర్పించుచున్నాఁడ. మీ యుపకృతికిఁ గృతజ్ఞుఁడ నగుదును. దేవతలారా! నా యీ దుఃఖమును మాన్పజాలరే? అయ్యయో!. వ్యాఘ్రంబులారా! మీరు మాయయ్య కంటిబాధఁ బోఁగొట్టితిరేని మిమ్ముల నిది మొదలు సంహరించనుజుఁడీ! యోకీటులారా! ననురక్షింపరే? యోమృగరాజా! "అటవ్యామి నారసింహః" అను లోకోక్తిని సార్థకముఁజేసి నా మొఱలాలించి నన్నీ ఘోర విపదబ్ధినుండి దరిఁజేర్పవా? నేనెంత వేఁడినను నాతో మాటాడఁ దలంపుఁ గొనలేదే?" యని యేమేమో కానఁ దిరుగుచు బలికి యించుక చింతించి "అయ్యయో! యేమి నాయీవెఱ్ఱి? నేనెవరిని గూర్చి యాఁరీతిఁ బలుకుచున్నాఁడను? నాకిట నెవరు ప్రత్యుత్తర మిత్తురు? నేను జడుఁడనై నోరులేని జంతువులనా వేఁడుచున్నాఁడను? అహహా! నే నీకాన వెఱ్ఱినై నిష్ప్రయోజనముగఁ బరిభ్రమించుచున్నాఁడనే. కాని యట మాయయ్యగతి యేమైనదో చూడనైతినే? ఇకనైనఁ బోయి చూచెద. కొంచెము నీరుగట్టినఁ దింకికేదైన నిచ్చి యాఁకలి యించుక

తీరిన పిమ్మట మందునకై యత్నించెదఁగాక ” యనుకొనుచు బోయి యీశ్వరలింగమును జూచుసరికి మునుపటివలెఁగాక యిప్పుడు కంటి వెంబడి రక్తధారలు మెండుగఁ బ్రవహింపఁ జొచ్చినవి.

దానిం జూచి కిరాతుఁడు “ అహాహా ! మా యయ్య కన్ను పోయినది. నే నేమో తెలిసినవానివలె మందు లని కాననున్నవానిని బెట్టుటచేఁ గన్ను పోయినది. నే నెంత కట్టిడినైతివి ? నే నింతదనుక మా యయ్యకై యనేక విధంబుల శ్రమ పడియు నిప్పుడు కన్నును మంటఁ గలిపినాఁడను. నాయట్టి పాపి యెందైనఁ గలఁడే ? పోని యిప్పుడు మా యయ్యను మా యుడుమూరికిఁ గొంపోయి మందుఁ బెట్టించెద ననినను బార్వతీకాంతుఁ డిపు డేరీతి రాఁగలఁడు ? ఇపుడీ బాధచేఁ దిండికూడ మానినాఁడు. దీనం జేసి ప్రాణముకూడఁ బోవునేమో ? ” యని చింతించుచు నుపాయమును గానలేక గోలుమని యేడ్చుచుండెను. అంతఁ గొంతవడికి మహాదేవుని కరుణాకటాక్షమున నుపాయం బొండు తోఁచుటం జేసి యేడుపు మాని నగుచు “ దేవా ! నీ కిఁక భయము లేదు. నీ కంటికి మందు తెలిసినది. “ ఉష్ణం ఉష్ణేన శీతలం ” అను రీతిని కంటికిఁ గన్ను కంటె వేఱొండు మందు లోకమునఁ గలదే ! నీ పోయిన కన్నును దీసి నా కంటిని దానికి బదులుగ నుంచువాఁడ. దానిచే నీ బాధ పోవును. నేనును సుఖ ముందును.

కీనికై యింత దనుక నెన్నియో యిడుమలఁ గుడిచియుఁ బ్రయోజనముఁ గనలేక వెఱ్ఱినై తిరిగితి గాని యీ యుపాయ మిదివఱకే తోఁచిన నిన్నింతగ బాధపడనిత్తునే? తొందర పడకుము. ఇదె నా కన్ను నిచ్చెద" ననుచు డాయం బోయి యుంచు కేనియుఁ దన శరీరమునకు భంగము కలుగునో లేక ప్రాణమే పోవునో యని యైన నాలోచింపక కడు భక్తితో నిజ బాణాగ్రంబునఁ దన కన్ను నూడఁబెఱికి రక్తధారాసిక్త మగు హరుని కంట నమర్చెను. అటులఁ దిన్నఁ డీశ్వరుని కంటికిఁ దన కన్నును దీసి యిచ్చెనే కాని తన యంగ విహీనతను బాటింపఁ డయ్యెనే? అంధుఁడై యాతఁ డేరీతి నిఁక శివు నారాధింపఁగలఁడు? "శరీర మాద్యంఖలు ధర్మసాధనమ్" అనుదానిని గూడఁ దలపలేదే? తనకుఁగల భక్తినే చూపెనుగాని శరీరసుఖమునకై యాలోచింపలేదు. భక్తుఁడన్న వీఁడేగదా! భక్తుఁడు ఈతనింబోలు వారెవరైనం గలరే? ఆబ్రాహ్మణుఁడు దీనినంతయుఁ గనులారఁ జూచు చుండెను.

—♦ తిన్నఁడు రెండవ కన్నును శివున కొసంగుట. ♦—

ఉమానాథుఁడు తన నేత్రము మునుపటికంటెఁ గడు సుందరమై విలసిల్లుచుండ మనంబున సంతసించియుఁ బైకి సంతుష్టిలేనటుల నటించి రెండవకంట రక్తధారలఁ బ్రవహింపఁ జేయనారంభించెను. దానింజూచి తిన్నఁడు "కంటికి నిజముగ

జబ్బుసంభవించినది. సాధనాంతరముల బాగుచేసినగాని లాభము లేదు. శివుఁడీబాధచేఁ దిండినిగూడ మానినాఁడు. ఇంకను గంటిబాధతగ్గనిచోఁ బ్రాణముకూడఁ బోవును" అనుచునించుక తడవు వగచి యీశ్వరకరుణాకటాక్షంబున నిదివరకుఁదోఁచిన యుపాయమేయిప్పుడును దోఁచుటం జేసి యాసన్నేశ్వరసాయుజ్య సామ్రాజ్య ప్రాభవుఁడగుట నిజనిర్మల జ్ఞానంబున నద్దాని నీశ్వరమాయా విలసితంబుగను, దనభక్తిం బరీక్షింప హరుఁడు కావలసి యిటులఁ జేయుచుండుటను గ్రహించి దృఢచిత్తుఁడై "యోదేవా! నన్నేటికి వెఱపించెదవు? నే నీవఱకుఁ గనిన మందు నాయొద్ద లేకపోయెనే? నా రెండవ కన్నునుగూడ నీకంటి కమర్చుటకు నే వెనుదీయుదునే? నీవేల సందేహించెదవు? ఇదిగో చూడుము. ఇప్పుడ నా రెండవ నేత్రమును గూడ వూడఁదీసి నీ రెండవకంట నమర్చువాఁడ. నాకేమియు భీతిలేదు. దేవా! నీదయ నాయెడఁ గలుగ నే నిందులకా భీతిల్లెద? ఇఁక నీమూఁడవ కంట రక్తధారలు ప్రవహించిన నేమిచేయుదునని యూ నీసందేహము? దానికిఁగూడ వెఱవను జుమా! వేయేల! దేవా! నిజముగ నీమూఁడవకంట రక్తధారలు ప్రవహించెనేని మనోదృష్టికి మూలంబగు నాదు ప్రాణంబుల నర్పించి నీ వేదనను మాన్పఁ గలాఁడను. ఇది నానిశ్చయము. నన్నిఁక నీవేమి చేయఁగలవు?" అనుచు డాయంబోయి రక్తము కారకుండ నీశ్వరుని కన్గొనఁ జెప్పు

# అయిదవ ప్రకరణము.

కాలఁ దన్ని పెట్టి వాఁడిబాణంబునఁ దన రెండవ నేత్రము నూడఁదీయ సంసిద్ధుఁడై యుండెను.

మహాదేవుఁడు తిన్నని సంరంభమును జూచి తనలో "నాకై దడసిన దిన్నఁడు తన రెండవ కన్నునుగూడఁ దీసి వేయుననియుఁ దానుమఱలఁ దిన్ననికి నేత్రములఁ బ్రసాదింపవలయుననియు, నింకను దిన్నని దుఃఖపెట్టుట న్యాయము కాదనియు, నెంచి యధికసంభ్రమంబున లింగముం జీల్చుకొని కంటికొననూనిన తిన్నని బాణమును జేతంబట్టుకొని "వత్సా! తిన్న! ఆగుమాగుము. ఏల త్వరపడియెదవు? నీభక్తికి మది మెచ్చినాఁడ. నానేత్రము బాగుపడినది. నీ రెండవ నేత్రము నూడఁదీయకుము. నీమనోదృఢిమను జూడ నీరీతిఁ గావించితిని. కాని నాకంటి కావంతయేనియు బాధలేదు. నీవీయుద్యమమును మానుము" అనుచుఁ దన్ను హరియు, వాణీనాథుఁడును, నష్టదిక్పతులును, నింద్రుఁడును, సేవించుచుండ నగజా లలామ ముద్దుఁ గేలఁ గేలం గీలుకొలిపి నిజరూపమున నాతని యెదుట నిలువంబడి యుండెను.

అయిదవ ప్రకరణము సమాప్తము.

---



# తిన్నఁడు.

## ఆఱవ ప్రకరణము.

### ఈశ్వర ప్రత్యక్షము.

తిన్నఁడు తనకుఁ గాత్యాయనీ కాంతుఁడు దర్శనమీయ నించుక వడి నిలిచి యమితానందమున నైమఱచి ముకుళిత హస్తుఁడై యీశ్వర పాదంబులపైఁబడి సాష్టాంగ దండప్రణామంబులాచరించి యీశ్వరాజ్ఞఁ గ్రేవ నొదిఁగియుండెను. అప్పుడు హరుఁడు నిజాలయ సీమ నొదిగియుండిన పాఱునిఁజేరి " విప్రవర్య! నీవును దిన్నని భక్తిని గన్నులారం గాంచితివిగదా! ఇఁకనైన నీతఁడు మహాభక్తుఁడని చెప్పవచ్చునా ? ఈతఁడిచ్చు మాంసమును దినవచ్చునా? వీఁడొనర్చినయీరోఁతకు సహింపవచ్చునా? మహామహులనిపించుకొని కాయఁగసరులఁదినుచుఁ గానలనుండు మునులుగూడ నీతనితోఁ సరిపోల్పఁబడఁ జాలరనుట

కేమియు సందియములేదుగదా? వీనిభక్తికి మెచ్చి వీని పూజ కంగీకరించుటలో నాలోప మేమియును లేదుగదా? నే నీతనికి లోనై యున్నాఁడ నన దోషమేమియు నుండదుగదా? నా వ్రతము నీకిపుడు బాగుగఁ దెలిసినదా? ఈతెన్నని భక్తికినీవును సంతసించితివా? నీకంటెఁగూడ వీఁడు భక్తుఁడన నీవంగీకరించెదవా? వీఁడు నన్నీకానఁ బ్రతిదినంబును నీవలెఁ గాక సేవించుచుండుటం జేసి నేను సుఖముగ నుండఁ గల్గినాఁడను. తిన్నఁడును నన్నే దిక్కుగ నెంచియున్న వాఁడు. మీరాయిద్దరు నా నిజకింకరులు. మీ సేవకు నేనెంతయు సంతసించితి. ఇఁక మీ రేమి గావించినను నాకు సమ్మతము. ఇది మొదలు మీకు లోనైయుండువాడ. ఇంకను వలసిన నేదేని వరముం గోరుఁడు. అని యమితానందమున వారలకుఁ జెప్పెను.

ద్విజకిరాతులు హరుని వరము వేఁడుట.

హరుఁడు సాక్షాత్కరించి తమ్ముపలాలించుటం జేసి ద్విజకిరాతులు యోగిజన దుర్లభమగు దివ్యజ్ఞానమును బొంది యానందకందళిత గాత్రులును నానందాశ్రుపూరిత లోచనులును, గద్గదకంఠులును, ముకుళితాంజలులును నై "యో దేవదేవా! భక్తవత్సల! యాశరణాగతత్రాత! ఆర్తత్రాణపరాయణ! లోకైకరక్షక! జగద్వంద్య! సాధుజనాభిమానీ! దక్షాధ్వరధ్వంసక! గిరిజామనోహర! గజాసుర హంతక! మదనసంహారీ! పన్నగామరవంద్య! రాక్షస గర్వాపహారీ!

రక్షింపుము." యోగిజనులకేని దుర్లభమగు నీ దివ్యరూపమును జూడఁగోరి మేమిటులఁ బరితపించుచుండ నాశ్రితపావన తత్పరుండవై దివ్యరూపంబున మాకుఁ బ్రత్యక్షమైనాఁడవు. నీమూలమున జగజ్జనని యగు గిరిజయు మాకు నిజరూపమున దర్శనసుఖంబును గలుగఁజేసినది. నేడుగా మానోములు పండినవి. నేఁడుగా మాయీదేహములు మీకరస్పర్శంబునఁ గృతకృత్యము లయినవి. నేఁడుగా మావాక్కులు పవిత్రతనందినవి. అహహా! నిన్నుఁ గన్నులారఁ జూడఁగలిగిన మా భాగ్యమేమని చెప్పఁగలారము? చిరకాలము నుండియు నీ దివ్యరూపమును జూడఁగోరి యితరములవీడి కాయలే తినుచుఁ గానలనే వసించుచు, నిద్రయననేమో యెఱుఁగక యున్నారము. దేవా! నీవీనాటికి మాయెడఁ బ్రసన్నుఁడవైతివి. శంకరా! నీయాశ్రితవాత్సల్యమును నీప్రాభవమును, నీవు భక్తులయెడఁ బూనిన దృఢవ్రతమును, వాకొన వేనోళ్ళవాఁడును జాలఁడన నజ్ఞానతిమిరమగ్నులమగు మేమా వాకొనువారము? మేము భవసాగరమగ్నులమై పుట్టుచు గిట్టుచు నెన్నటికిని ముక్తిఁగానలేక యెటులనో నీ సాన్నిధ్యమును జేరినారము. దేవా! మమ్మీపట్టున దరిఁదేల్పవా? మఱియు శంకరా! నీ దివ్యతేజము జగన్మిథ్యయని చాటుచు మమ్ముఁబొంద మాయాసలడుగంటినవి. మనము స్వాస్థ్యమును జెందినది. దేహంబుపై మోహంబును బోయినది. నేటికి నీదయ పెంపున నిష్కాముల

మైతిమి. మాకిఁక వేఱొండు వరమున్నదే? మమ్మిటుల మన్నించినఁ జాలును. దేవా! జగములును, నంతరాత్మయు, సాక్షియు, నీవయంచు నిగమములు సహస్రముఖములఁ ఘోషించుచుండ వినియు మేము వేఱొండు వరమును వేడగలారమే? నీవు మాయెడ సంపూర్ణవాత్సల్యముఁ జూపనెంచితేని నీలో మమ్ము గలుపుకొని పునర్జన్మము లేకుండఁ జేయుము. ఇంతకు మించిన వరము మాకులేదు. శంకరా! నేనజ్ఞానతిమిరరమమానుఁడను. వీఁడన్ననో హీనకులజుఁడగుకిరాతుఁడు. నీవిపుడు మమ్మడిగియేనా నీదివ్యరూపమును జూపినాఁడవు? నీదివ్యరూపమును జూపిన మాడ్కి భవప్రయాసమును మాన్పుము. వేయేల! శంకరా! మా యూహలు నీ యూహల కెక్కుడగునే? నీచిత్తమెట్లుండిన నట్లు చేయుము. మా మన మిది వఱకే యానందజలధి నోలలాడుచుండినది. వరమీతలంపు గలదేని యుష్మత్సాయుజ్య సుఖము నిమ్ము" అనుచుఁ బ్రార్థించిరి.

ద్విజ కిరాతులు హర సాయుజ్యము నందుట.

ద్విజకిరాతులు శివసాయుజ్య సామ్రాజ్యమును గోరి సాష్టాంగ దండప్రణామముం జేయుచు నీశ్వరుని యెదుట నిలువ వారలఁ గనుగొన మహేశ్వరుఁడు "వత్సలారా! మిము మెచ్చితి. మీరిఁక విచారింపకుఁడు. మీకు నేటితో భవబంధములు తీరినవి. ఇది మొదలనంతమగు మదీయ సాయుజ్య

సామ్రాజ్యము నాచంద్రతారకముగఁ బాలింపుచు ముదంబున నుండుఁడు” అని సెలవొసంగి బ్రహ్మాది దేవతలును, గరుడ కిన్నర యక్షాదులును, గిరిజామ తల్లియు, నీశ్వరుని సామర్థ్యమును, భక్తపారతంత్ర్యమును, గీర్తించుచుండ సపరివారంబుగఁ గైలాసంబున కేగెను.

తిన్నఁడీశ్వర సాయుజ్యమును బొందుట కేమి కొదువ? తిన్నఁడు సామాన్యుఁ గిరాతుఁడే? ఎన్నఁడైనఁ గిరాతులు ముక్తిం గనఁజాలిరే? నాఁడు నారాయణసఖుఁడై నారాయణ ప్రతిష్ఠాపిత ధర్మరాజ్య శాసనకర్తయగు నరుఁడు కాఁడే! యీతిన్నఁడు మఱియు నాఁడు కృష్ణసహాయమున క్షాత్రధర్మ పురస్సరుఁడై కురుకులాటవీదహనముం గావించిన యర్జునుఁడే యిపుడీశ్వర సహాయమున సంసారాటవీ దహనముం గావించె. నాఁడు శ్రీకృష్ణార్పణముగ వైరిజంతునికాయంబులఁ జెండాడిన ఫల్గునుఁడిపు డీశ్వరార్పణంబుగ ఘాతుక జంతువ్రల సంహరించె. మున్ను విలాసంబుగ నారాయణుని పంక్తిం బంచ విధాహారంబుల మెసంగు విప్వంచుండీయెడ హరునితోడఁ గోలామిషఖండంబుల నవ్వారిగ మెసంగె. పూర్వము శాస్త్ర చోదితముగ నారాయణార్చన నాచరించిన పార్థుఁడు నేఁడు తద్భిన్నమతంబున హరునిఁ బూజించె. చిన్న నాటనుండియు, నారాయణునితోఁటిదే లోకమనుచు నాతఁడే దైవమనియు నాతఁడే సఖుఁడనియు, నాతఁడే జనకుఁ డనియు, నాతఁడే ప్రభు

వనియు, నాఁడే చుట్టమనియు, నెంచి సేవించు నరుఁడేయిపుడు తిన్నఁడై యీశ్వరుని కంటెఁ దనకాప్తులు లేరని యాబాల్యము నుండియు నాతనినే సేవించి తుదకు ముక్తిఁ గనఁగలిగెను. కృష్ణసహాయ్యంబున ఘోరకాంతారమును సుఖమని యెంచిన యానరుఁడే యీ తిన్నఁడై యీశ్వర సహాయమున నడవి నొంటిమనఁగలిగె. లోకకంటకులఁ జెండాడి కృష్ణార్పణముగ హయమేధమును ధర్మరాజుచేఁ జేయించి రమానాథుని సాయుజ్య సామ్రాజ్యమును బొందిన కిరీటియే యిపుడు తిన్నఁడై యీశ్వరార్పణంబుగ స్వనేత్రంబుల నర్పించి యోగిజన దుర్లభమగు హరతాదాత్మ్య సుఖమును బొందె. అర్జునుఁడే యీ తిన్నఁడు.

పరిసమాప్తము.

శ్రీరామచంద్రార్పణమస్తు.





# గుణనిధి.

## మొదటి ప్రకరణము.

కాంపిల్య నగరంబునందు యజ్ఞదత్తుఁ డనువిప్రపుంగవుం డొకండు గలండు. అతఁడు సద్గుణగరిష్ఠుఁడై మెలఁగుచుఁ దండ్రియాజ్ఞ విద్యాభ్యాసమునకై గురుగృహంబున కేగి యతనికి సేవఁ జేయుచుఁ జతుర్వేదంబుల నభ్యసించి వేదాంగంబుల పారంబుఁ జూచి యజ్ఞాదిక్రతువులఁ జేయించుటయం దసమానుఁడై గుర్వాజ్ఞ నిజజనకులఁ జేరె. తోడనే యాతని జనకులు సకలవిద్యా పారంగతుఁ గుమారుం జూచి యధికానందంబున నోలలాడి కులీనయు, సద్గుణవతియు, సులక్షణయు సమవయస్కయు నగు నొక కన్యను వివాహముఁ జేసిరి.

యజ్ఞదత్తుఁడు తన యభివృద్ధిని గోరు జనకులకు సేవఁ జేయుచు నిజభార్యఁ గదిసి సాంసారిక సుఖంబుల ననుభవించుచుండె. అతఁ డనుదినమును బ్రత్యూషకాలంబున లేచి నదీ

తీరంబున కేగి యర్ఘ్యోదక సచ్ఛాతుండై యఘమర్షణ స్నాన మాచరించి యర్ఘ్యాదివిధులఁ గావించుకొని యింటికి వచ్చు చుండెడివాఁడు. నిజభర్త స్నానమాడి వచ్చుసరికి భార్యయు లేచి కాలోచిత కృత్యంబులఁ దీర్చుకొని నిత్యానుష్ఠానంబునకు వలయు సాధనంబులఁ గొఱంతలేకుండ సమకూర్చియుంచెడిది. యజ్ఞదత్తుఁ డగ్ని కార్యాది విధుల నెరవేర్చుకొని శిష్యుల రావించి వేదంబుల, శాస్త్రంబులఁ జెప్పుచుఁ గుతుపకాలంబగు సరికి యింటికి వచ్చిన యతిథుల నాదరించి వారితో నతిరుచ్యం బులగుఁ బదార్థంబుల భుజించుచుఁ గాలముఁ గడపుచుండెడి వాఁడు. ఇట్లుండఁ గొంతకాలంబునకు యజ్ఞదత్తుని తలిదండ్రులు స్వర్లోక నివాసంబున కేగిరి. అంతయజ్ఞదత్తుఁడు దలిదండ్రులకుఁ బార లౌకిక క్రియల విధివిధానంబునఁ గావించి యనంతరము కులాచారము ననుసరించి యాగంబులఁ గావించుచు సోమి దమ్మను గలిసి సుఖంబుగ జీవనంబు సలుపుచుండెను.

## —♦ యజ్ఞదత్తుఁడు రాజ గురువౌట. ♦—

అంత నొక కొంతకాలంబున కాపత్తనం బేలు రాజు యజ్ఞదత్తుని సత్కర్మ కలాపంబులకు మనంబున ఘనంబగు నానందంబు నంది యాతని నిజగురువుగఁ జేకొన నుప్పతిల్లిన తలంపు తన్నుఁ ద్వరసేయ సహచర ద్వితీయుఁడును, ఽనీత వేషుండునునై యజ్ఞదత్తుని యిలు సేరి యాతని దర్శనమున కెదురు సూచుచుండె. తోడనే దాదాల నుండిన యాతని

శిష్యులు చేరంజని యాతని నుచితాసనాసీనుం గావించి యజ్ఞదత్తున కీవార్త విన్నవించిరి. యజ్ఞదత్తుండు రాజా గమనమును విని త్వరమాణ హృదయుండై యేతెంచి నిజాంగణసీమందనకై వేచియుండిన భూజానిని నాదరించె. రాజు తన్నాదరించిన యజ్ఞదత్తునకుం గుశలవార్తలం జెప్పి "విప్రోత్తమా! సకల ధర్మ సాధనంబగుభవచ్ఛరీరంబునీరోగంబుగ నున్నదియే తావకీనులగు శిష్యులు యుష్మత్పాదసేవారతులై వేదాది విద్యల నభ్యసించు చున్నవారే? మీచేయు క్రతువులకును నతిథి సంతర్పణంబులగు కును లోపంబులేకుండ మీకుసుఖజీవనంబు జరుగుచున్నదియే?" యని భయభక్తియుతుండై కేల్మోడ్చియడుగ యజ్ఞదత్తుండు రాజు తనయెడం జూపిన వినయంబున కెంతయు మనంబున ముదంబంది "రాజా! మీబోటి ప్రభువులు ధర్మంబుగ భూమిని బాలించుచుండ మాదృశులకు లోపంబులు గలుగ నేర్చునే? నీ ధర్మపరిపాలనంబున మాకు సమస్తంబై యున్న యది. మాకే విషయంబునను గొఱంత యొనుమంతయును లేదు. కాని సుకుమారదేహులగు మీకు శ్రమంబు గలుగం జేసి యిటకు రావించిన యాకార్య గౌరవంబెట్టిదియో వినం గోరి మనంబు కరంబు త్వరపడుచున్నయది" యని యన నాతండు మందహాసంబుం జేయుచుం "బండితోత్తమా! మీ గుణగణంబులు నన్నుం ద్వరసేయ నే మీపాదసేవం గోరి యిటకు వచ్చినాండ. కాన నా ప్రార్థన మన్యథాకరింపక

నన్నొక శిష్యునిగఁ జేకొని నాచేయు సపర్యలనందుచునన్నను, మా వంశీయులను దరింపఁజేయు"డని కడుంగడు వినయంబునఁ బ్రార్థింప యజ్ఞదత్తుఁ డంగీకరించి రాజునకుఁ సెలవొసంగి యానాఁడుమొద లనవరతము రాజభవనమునకుఁ బోవుచు నారాజుచేననేకంబులగుయజ్ఞంబుల నిర్విఘ్నంబులుగఁ జేయించుచుండె. రాజును యజ్ఞదత్తుని యభిమానమునకు సంతసించి యాతని కమితంబుగ ధనంబు నొసంగుచుఁ దదనుగ్రహపాత్రుఁడై మెలఁగుచుండె.

## —♦ సోమిదమ్మ. ♦—

యజ్ఞదత్తుఁడు రాజపూజితుఁడై యమితంబుగ ధనంబును సముపార్జించి యింటఁ బెట్టుచుండ సోమిదమ్మయు ననవరతము భర్తృసుఖంబునే కోరుచు నేవిషయంబునను బ్రాణనాయకున కడ్డురాక యాతనికిఁ దోడు నీడయై మెలఁగుచు దానధర్మంబులఁ గ్రతువుల బ్రాహ్మణ పూజలఁజేయు బ్రాణేశ్వరు ననుసరించు చుండెడిది. యజ్ఞదత్తుఁడు కులవతియు, గుణవతియు, ధర్మ శీలయు, నగు సోమిదమ్మ తనయెడఁ జూపు భక్తికి, ననురాగంబునకును సంతసించి సోమిదమ్మ తనకు సత్కళత్రంబగుటంజేసియే తనకిట్టి యభివృద్ధియు, సద్బుద్ధియు, రాజ పూజయు సంభవించుచున్నవి యని యెంచుచు నామెకు సర్వ విధంబుల సంపూర్ణ స్వాతంత్ర్యము నొసఁగి తాను రాజతో డిదే లోకమనుచు నుండెడివాఁడు. పాపము! సర్వ

విధ సౌభాగ్యంబుల నంది లక్ష్మీ నారాయణులం బోలియుండిన యాదంపతులకు వంశోద్ధారకుఁడగు సుతుని మాత్ర మా దైవము ప్రసాదింపఁడయ్యె. దానం జేసి సోమిదమ్మ "యయ్యయ్యో! యిన్ని దినాలనుండియుఁ గాఁపురముఁ జేయు మాకొక సుతుఁడు లేఁడయ్యెనే? మాకెంత భాగ్యముండిననేమి? యెన్ని ధర్మ కార్యములఁ జేసిననేమి? మాకీ లోపంబెట్లుపోవును? మమ్ముల నిఁక నీభవాబ్ధిఁ దరిఁజేర్చు వారెవరు? సుతులంగని వారలఁబెంచివారుదరిఁజేరిముద్దులొల్కు బల్కులబల్కుచుండ వినియానందించు భాగ్యము నాకీజన్మంబునఁ గలుగదయ్యెనే? నేనేమిసేయుదును? మఱియుఁ బురాణంబులు పుత్త్రిలులేని వారికిఁ బుణ్యగతు లుండవనియుఁ బున్నామనరకముసంప్రాప్తిం చుననియుఁ జెప్పుచున్నవే? దానంబులును యజ్ఞంబులును, వ్రతంబులును, సత్సుతునిఁ బోలఁ జాలవని వేనోళ్ళం జాటు చున్నవే? లోకంబులోని యువిదలు నిజ సుతుల కుపనయనాదులఁ గావించి వారి సంతోషమే తమ సంతోషమనియు, వారి సుఖమే తమసుఖమనియు నెంచి సదా వారికై పాటుపడు చుంద్రుః నాకట్టి భాగ్యములేకపోయెనే? యని యనవరతము విచారించుచుండెడిది.

—◆ యజ్ఞదత్తుని విచారము. ◆—

యజ్ఞదత్తుఁడు తనకుఁ బుత్త్రి సంతతి లేమింజేసి తన్నుఁ గని విద్యాబుద్ధులఁ గఱపిన పితరుల ఋణముఁ దీర్ప నుపా

యాంతరమునం గానక దీనుండై యాశ్రితావన తత్పరుండగు నీశ్వరు నుద్దేశించి "యోదేవదేవా! శంకరా! దీనరక్షకా! నేననవరతము నిన్ను ధ్యానించుచు నిన్నే దిక్కుగ నెంచి యుండ నాకొక పుత్త్రి సుఖమును దప్ప నితర సుఖముల నన్నిటి నొడఁగూర్చితివి. ఎన్ని సంపద లుండినను బుత్త్రి సంపద లేక లాభ ముండునే? జను లందఱును సంసార సాగరమును దాటుటకు సుతుండను నుడుపమును గోరుచుంట నీవెఱుంగవే? ఈశ్వరా! నాకును నాపితరులకును బున్నామ నరకమును గలుగఁజేయ నెంచితివా? అపుత్త్రికుఁడ నగు నేను దర్పణోదకముల విడుచుచుండ స్వర్లోక నివాసు లగు నాపితరులు "అయ్యయో! వీనితో మన వంశ మంతరించుచున్నదే? వీనియనంతరమిఁక మనకు జలంబుల నెవరు విడతురు? ఏజన్మమునఁ జేసిన సుకృతముననో మన యింటనుండినను బుత్త్రునికి సంతతిలేమిఁ జేసి నరకమునఁ బడ నున్నారమే" అని కుందుచుఁ దర్పణోదకములఁ బానముఁ జేయుచున్నారము. నేనింత దనుక భాగ్యశాలిననియుఁ బుణ్య వంతుఁడననియు మనంబున నెంచి సంతసించుచుంటినే కాని యపుత్త్రికుఁడనని మాత్ర మెంచుటలేదు. ఉమాధవా! లోక మున జనులు నిజసుతులు గజ్జలందియలు మొరయఁ బర్వి డిదుచు ధూళిధూసరిత గాత్రంబులఁ దమ యంకపీఠిం జేరి రదనకుట్మలంబులఁజూపుచు నస్పష్టాక్షరంబుగఁ బల్కుచు నిర్ఘ

మిత్రంబుగ హసించుచుండ విని కని యానందించు చుంద్రుం. నా కట్టి యానందము గలుగదయ్యెనే? నాకును లోకము లోని వారికివలెఁ బుత్త్రదర్శన సుఖమును గలుగఁజేయవే? అపుత్త్రకులగు జనులు గార్హపత్యమున నుండిన నేమి లాభమేమి? సంతతియుండిన గదా గార్హపత్యమున సుఖము? వేయేల! దేవా! మాకొక సుపుత్రునిఁ బ్రసాదించి నాయెడ నీకుఁ గల వాత్సల్యమును బ్రకటింపు మనుచు వేఁడుకొని యింటికేగుసరికి సోమిదమ్మయుఁ బుత్రులు లేమికిఁ గుందుచు నాథుని సమీపించెను. పురుషుఁడగుటను విశేషించి విద్యాశాలి యగుటను యజ్ఞదత్తుఁడు పుత్రులు లేరని విచారించు నిజభార్యనెటులో యోదార్చి యిరువురును బుణ్యవ్రతముల నధికంబుగఁ జేయుచుండిరి.

## —♦ పుత్త్ర ప్రాప్తి. ♦—

పుత్ర సంతతి లేమికి మిగుల వగలం బొందుచున్న సోమిదమ్మకుఁ గొన్నినాళ్లు గడచుసరికి దైవానుగ్రహంబున గర్భంబు నిలిచె. తోడనే యజ్ఞదత్తుఁ డమితానంద పరవశుఁడై గర్భదోహదంబులఁ గావించి గర్భస్థ శిశురక్షణనై పుణ్యవ్రతంబుల నధికంబుగఁ గావించుచుండె. సోమిదమ్మయుఁ జిరకాలమునకుఁ గలిగినఁ భాగ్యమునకై మదిని సంతసించుచు నిత్యదానంబుల దేవపూజల బ్రాహ్మణ భోజనంబులఁ ననవరతముగావించుచునవమాసంబులునిండనొక ముహూర్తంబున

మారసదృశాకారుఁ గుమారుం గనియె. తోడనే యజ్ఞదత్తుఁడు పుత్రోత్సవముం జేయించి జాతకర్మకలాపంబులఁ గావించి బాలునకు "గుణనిధి" యని నామకరణంబును భార్య యనుమతింగావించి తాను సకలశాస్త్రపారంగతుఁ డగుట నిజసుతుని భావిదశను జూచి మున్ముందా బాలుఁడు దుష్ప్రవర్తనుఁడు కాఁగలఁ డనియు, నాతని వలన నిజమనోరథ మీడేరఁ జాలదనియు నెఱింగి దానిని దన మనంబున భద్రపఱచి భార్యకుఁ జెప్పకుండ వానిని దగు శిక్షలో నుంప వలయునని మాత్ర మెంచుచుండెడివాఁడు. సోమిదమ్మ మాత్రము కానక కన్న సంతానమగుటచే నాతని నమితంబుగఁ బోషించుచుండె. బాలుఁడును దినదినాభివృద్ధి నందుచు శైశవము నతిక్రమించె. యజ్ఞదత్తుఁ డాతని కుపనయనాది కర్మకలాపంబుల విధివిధానంబున జరిపించి వేదాదివిద్యల నభ్యసించుటకై తగు గురువుల యొద్దకుఁ బంప నిశ్చయించి భార్యకుఁ జెప్పి యొప్పించెను.

## —♦ విద్యా ప్రారంభము. ♦—

యజ్ఞదత్తుఁడు నిజపుత్రుని గురుసమక్షమున వీడిపోవ నాతఁడు గురుల యుపదేశంబులఁ బాటింపక తోడిబాలురు చదువుచుండ వారల నిందించుచు గురువులకుఁ దెలియకుండ నెటకేనిపోయి దుష్టులఁ గలిసి తల్లికిఁ దెలియకుండ నాడు చుండెడివాఁడు. సోమిదమ్మ పుత్రమోహమున నాతనిచెయ్వుల

కంతరాయమును గల్పింపక తనకుఁ గల గారాబమునే చూపిం
చుచు గాని యాతనిఁ దగువిధంబున శిక్షింపఁజాలదయ్యె.
గుణనిధి తనకుఁ గల భాగ్యంబునకుఁ దోడు యౌవన సంప
దయు దానికిఁదోడు దుస్సహవాసంబును దానికిఁదోడు సోమి
దమ్మచూపు వాత్సల్యంబును వృద్ధియగుచుండ ముచ్చటకైనను
జదువనుదానినెఱుంగక యూరఁదిరుగు దబ్బరలంగలసి చరించుచు
రహస్యంబుగ నింటఁగల ధనంబును జేకొని దుండగీడులఁ గలసి
దుర్వ్యయంబులఁ గావించుచు దుర్వ్యసనంబులకు లోనైయుం
డెడివాఁడు. పాపము! సోమిదమ్మ పిల్లవాఁడు బ్రతికి యుండినఁ
జూచుకొనవచ్చుననియుఁ జిన్నతనంబగుట నీరీతిగ నున్నాఁడు
కాని కాలమువచ్చిన వాఁడే బాగుపడి కులాగత ధర్మ పరిపాలకుఁ
డగునని యెంచుచు గారాబమున వానిని రక్షించుచుండెను.
ఆమె తనకుఁ దనయుని యెడఁగల వాత్సల్యమునే ప్రధానముగ
నెంచుచుండెడిది. కాని యాతని భావిదుర్దశను మాత్రము
పాటింపకుండెడిది. గుణనిధి లోపము లేకుండఁ దల్లి తన్ను
సంరక్షించుటంజేసి నిర్భయుఁడై యూరఁ దిరుగు చుండెను.

## —♦ యజ్ఞదత్తుఁడు తనయుని ప్రవర్తనము నెఱుంగుట. ♦—

గుణనిధి యిట్లు తిరుగుచుండ షోడశవర్షంబు లతిక్ర
మించినవి. కాని బాలునకు మాత్రము విద్యయనునది లేశమైన
నలవడలేదు. దుస్సహవాసము వృద్ధియయినది. దానికిఁ దోడు
దుర్వ్యసనంబులును మెండయినవి. తల్లియుఁ గుమారుని వర్తన

మును గుర్తించియుఁ దగు శ్రద్ధఁ జేకొని బాలుని సత్ప్రవర్తనము కలవానిఁగఁ జేయవలెను యత్నముం జేయఁడని మాత్రము యజ్ఞదత్తునకుఁబిల్లవానియందుఁగల వాత్సల్యంబునఁ జెప్ప సాహసింపదయ్యె. ఒకనాఁడు బ్రాహ్మణుఁడు పిల్లవానిని విద్యావిషయంబునఁ బరీక్షింపఁ దనకు సమయముచిక్కనందుల కెంతయు విసుగుకొనుచు నెట్లో సమయము నన్వేషించి పిల్లవానిం బిలువఁ బిల్లఁడింటలేఁడయ్యె. అంత సోమిదమ్మను బిలిచి పిల్లవానిజాడ నామెనడుగ "నిప్పుడె పాఠముఁ జదువుకొన గురుసదనంబునకేగె" ననిచెప్పె. తోడనే యజ్ఞదత్తుఁడు గురుసదనంబున కేగి యట నిజసుతుఁడు గానరామి గురుని సమీపించి పిల్లవాని వృత్తము నాతని నడుగ "మీసుతుఁడు నాయొద్ద కెప్పుడును వచ్చుటయేలేదు. నేనెన్నిసారులు రావింప యత్నించినను గనఁబడుటయునులేదు. ఇంట నెప్పుడును లేఁడనియే తెలియుచున్నది. మఱియు భవత్సూనుఁడూరనుండు దుష్టుల సావాసముఁ జేయుచున్నాఁడని నాకుఁ దెలియవచ్చినది. ఈ వృత్తమును మీకు విన్నవింప యత్నించుచున్నాను." అని గురుఁడు వలుకఁ గోపంబున నింటికేతెంచి భార్యను జూచి "ఓసీ! లేక లేక కలిగినసుతుఁడు బుద్ధిమంతుఁడై మనలను గులమును సముద్ధరింపఁ గలాఁడని యెంచి మనంబున నమితానందమును బొందుచుండ నీవు వానిని గడు గారాబమునఁ జూచుచున్నావే కాని తగు బుద్ధిఁజెప్పి వానిని సార్థక నామునిగ

చేయ నెంచవైతివిగా? నేను వీఁడుద్భవించిన కాలముననే మనకు వీఁడు పరిచర్యఁ జేసి యవసానమున నూర్ధ్వలోకక్రియలను జేయఁజాలఁడనియుఁ గులాచారమును నిలుపలేఁడనియు, మనకుఁ గల గౌరవమును గూడఁ బోఁగొట్టుననియు, వంశముఁ జెఱచుననియుఁ దలంచి యున్నాఁడను. నా తలంపున కన్యథాత్వమేల కలుగును? నీవు కులసతివనియు, గుణవతివనియు, నీయం దుదయించినవాఁడు సత్సుతుఁడు కాఁగలడనియు నిఁక నా కే విషయమునను లోపము లేదనియు మనఃపూర్తిగ నెంచి నీకు సర్వస్వాతంత్ర్యము నొసంగి రాజభవనంబునకుఁ బోవుచున్నాఁడను. నీవును నే నొసంగిన స్వాతంత్ర్యమునకుఁ దగు ఫలము నీయ నెంచి సుతుఁడు చదువక యూరఁగల దుష్టులఁ గలిసి యాడుచుండ వానిని దండించి తగు బుద్ధులఁ జెప్పక యుపేక్షించి వంశమును బాడుచేయఁ దలంచితివి. నీ పుత్రునకుఁ బదునాఱు వత్సరములు గతించినవి. ఇంత దనుక సజ్జనసావాసమన్న నేమో యెఱుఁగని వాఁడిపుడేరీతి బుద్ధిఁ గలిగి సజ్జనులఁ జేరఁగలఁడు? పోనీ నే నాతనిని జేరఁదీసి విడువక శిక్షింతమన్నను నాకు స్వాతంత్ర్యమును జీవిక యొసంగదు గదా? ఒకవేళ శిక్షింతమన్నను వానికా కాల మతిక్రమించినదే? ఇఁక వానిని మనము మిత్రునివలెఁ జూడవలసినదే కాని మఱియొక రీతిఁ జూడ వలనుపడదు గదా? నీవింతవఱకు వానిని గారాబమునఁ బెంచుచు వాని చెయ్వుల కంత రాయ

మును గల్పించి వానిని బుద్ధిమంతునిఁగఁ జేయఁజాలవైతివి గదా ? ఇఁక నీవైనను వానిని శిక్షింపఁ జాలవే ? అయ్యయ్యో! నీవు వాని భావిదురవస్థం గనుఁగొన నేరక వానికి శత్రువవైతివే ? నీవా వానికి నిజమగు తల్లివి ? ఇదియా నీవు వానియందుఁ జూపు వాత్సల్యము ? అహాహా ! చిన్ననాటనుండియుఁ దగు శిక్షనందని బాలుఁడు కులీనుఁడయ్యు సత్ప్రవర్తనుఁడును, విద్యావంతుఁడును, నెట్లు కాఁగలఁడు ? ఈ పుత్త్రుఁడు కులగౌరవము నేరీతి నిలుపఁగలఁడు ? లోకమున నందఱును నన్ను దీక్షితుండని పిలుచుచు నమితంబుగ గౌరవించుచుండ నాపుత్త్రుఁ డవివేకియు గుణహీనుఁడును, దుస్సంగతుఁడును నై తిరుగుచున్నాఁడే ? అట్టి వాఁడు నా కొడుకని నేనెట్లు చెప్పుకొనఁ గలాఁడను ? అని నిందించుచుఁ బరిపరి విధంబులఁ బుత్త్రుని యయోగ్యతకు విచారించుచుండ సోమిదమ్మ యించుక ధైర్యమూని సుతుని యవగుణంబులను మఱుఁగుపుచ్చ నెంచి "అయ్యా ! తామూరక యెందులకు విచారించెదరు ? నే ననవరతముఁ బిల్లవానిని దగు విధంబున శిక్షించుచున్నానే కాని యెన్నఁడును ముద్దుజేసి యెఱుఁగను. మఱియుఁ గురువులు సెప్పిన పాఠములను జదివినఁగాని యెన్నఁడును దిండియైనను బెట్టుటలేదు. మీకెవరో మన పిల్లవాని వినయసంపదకును, సౌందర్యగరిమకును, సౌశీల్యమునకును సత్ప్రవర్తనమునకును, బుద్ధివైశాల్యమునకును సహింప

జాలక తమకుఁ దోఁచినటులఁ జెప్పిరి. మీరును బరుల మాటలనే "ఇంటిచెట్టు మందునకుఁ బనికిరా"దను నట్లు నమ్మి సద్గోష్ఠులమగు నన్నును, నాపుత్త్రిని నిందించుచుఁ గులమును బాడుచేసితి మనియుఁ బాడుచేయుచున్నా మనియుఁ బాడుసేయ నున్నారమనియు నేమేమో చెప్పుచున్నారే కాని మాయందిసుమంతయు దోషము లేదని మాత్రము గ్రహింపకైరి. మన పిల్లఁడు తోడి బాలురఁ గలిసి చదువుకొని యింటికి విశ్రాంతికై సాయం సమయమున గ్రీడించుచు జీఁకటియగు నంత కిలు సేరి సంధ్యవార్చి యన్నముఁ దినుటకైనఁ దీరిక లేకుండఁ బాఠంబులఁ జదువుకొనుచుండును. తమకుఁ దీరిక లేమింజేసి పరుల మాటలను నమ్మి యిటుల మమ్ములను నిందించుచున్నారు. కాని వాని గుణగణంబుల నొకసారి తాము పరీక్షించిన నాతఁడు సార్థక నాముఁడని మీరే చెప్పితీరెదరు. మఱియు నాతని రూపరేఖా విలాసంబులకు లోనై యెంద ఱెందఱో పిల్ల నిత్తుమనుచుఁ జెప్ప రా నేను మాపిల్లవానికి విద్యాపూర్తియగు నంతవఱకుఁ బెండ్లి సేయనని మోమోటమి వీడి మన గుణనిధి వినుచుండఁ బల్కుచుందును. దానంజేసి వాఁడు పూర్వముకంటె నెక్కుడు శ్రద్ధఁజేకొని చదువు కొనుచున్నాఁడు. ఇఁక మీరు లేనిపోని విచారమును మనమునం దుంచుకొనక నిర్విచారంబుగ నుండుఁడు. వేయేల! పిల్లవానిని సద్గుణునిగఁ జేయు భారము నాయది. ఇఁకఁ గొన్ని దినములు

గడచిన వాఁడును మీవలె దీక్షితుఁడు కాఁగలఁడు. అప్పుడు మీరే సంతసింతురు. ఇప్పుడు నేనెన్ని చెప్పినను మీరు సంతసింపరు. అయినను నామాటల విశ్వసించి వానికిఁ దగిన కన్య నొకతెను దెచ్చి వివాహముఁ జేయ యత్నింపుఁడు" అని యేమేమో దీక్షితునకు నమ్మకము కలుగునటులఁ జెప్పెను. అంత నాదీక్షితుఁడు భార్య మాటలను నమ్మి రూపవతియగు నిజ స్యాలుని సుతను గుణనిధికి వివాహము గావించి భార్య నుద్దేశించి "సోమిదమ్మా! నీ చెప్పిన చొప్పున గుణనిధికిఁ బెండిలి గావించితిని. సిరికఁ వాఁడు చదువుకొనునట్లును, సంధ్య వార్చునట్లును, నగ్నికార్యము జేయునట్లును శిక్షించుచుండుము" అని నయమునను భయమునను జెప్పి తాను యథాపూర్వము రాజగృహమునకుఁ బోవుచుండెడివాఁడు.

ప్రథమ ప్రకరణము సమాప్తము.



# గుణనిధి.

## రెండవప్రకరణము.

### గుణనిధి వర్తనము

వివాహముఁ జేసి యజ్ఞదత్తుఁడు సుతుని దగువిధంబున
శిక్షింపుమని భార్యకుఁజెప్పి తాను వ్యాపారాంతర నిమగ్నుఁడై
యుండ నొకనాఁడు సోమిదమ్మ గుణనిధినిఁ బిలిచి యాతని
విషయమై తనకును భర్తకును జరిగిన సంవాదమును బూర్తిగ
జెప్పి వంశాచారమును, సుగుణ గణ సంపాదనము వలన
గలుగు లాభములను జెప్పి సద్బుద్ధిఁ జేకొని గురుల యాజ్ఞా
పాలకుఁడవై వేదాది విద్యల నభ్యసింపుమనియు లేనిచో నీ
తండ్రి నిన్నును నన్నును బహిష్కరించుననియు నుపదేశించి
గురువులయొద్దకుఁ బంపుచుండెడిది. యాజ్ఞదత్తి తల్లి చేసిన
యుపదేశములఁ బెడచెవిం బెట్టి యిదివరకు ధనమునకై
తన్నాశ్రయించి చేదోడు వాదోడుగ నుండి చరించు గర్భ
దరిద్రులగు మిత్రులే తనహితమును గోరుచున్నారనియు వారి

యుపదేశమే తనకు లాభకారి యనియు నెంచి వారలతో
యథాపూర్వముగఁ జరింప మొదలిడెను. దరిద్రులగు నా
కపట మిత్రులు తాము దుష్టులగుట వానిని గూడఁ జెరుప
నెంచి దమ దుర్వ్యసనంబులకై వానికి నమ్మకముఁ బుట్టించి
యాతని ధనమును వెచ్చింప నెంచిరి.

సంప్రాప్త యౌవనుఁ డగు గుణనిధి యనవరతము నట
విటపీఠమర్దకాలేయ చేటకులం గలసి తిరుగుచుండెడివాఁడు.
కాని యిసుమంతయేని తాను దీక్షితుని సుతుఁ డని మాత్ర
మెఱుంగక తన సఖులతోడిదే లోకమనుచు నొక్కొక్క
తఱి నాస్తికులం గలిసి బ్రాహ్మణాచారమును నిందించుచుఁ
దానాచారహీనుఁడై చరించుచు, గులక్రమాగతములగుఁ
త్రేతాగ్నులఁ బరిహసించి యగ్ని కార్యముఁ జేయు
మనియు సూర్యోదయాత్పూర్వమే లేచి సంధ్యావందన
మాచరింపుమనియు బోధించు తల్లిని మోమోటమి లేకుండ
నిందించి యామె యొనఁగూర్చిన పరికరములను విరఁజిమ్ముచు
గృహదేవతలు శపించు ననియుఁ గులీనుల మగు మన యింట
ననాచారము ప్రబలఁగూడదనియుఁ దల్లి చెప్పుచుండ నామె
మాటలం బెడచెవిం బెట్టి నిజ మిత్రులు తనకై యెక్కడ
వేచియుందురో యను భయంబున సిద్ధపఱచి యుంచిన వంట
కములఁ గంఠదఘ్నముగ భుజించి తన కా దినమునకు
వలయు ధనమును దల్లి యెఱుఁగకుండ గొంపోయి స్నేహితులు

చెప్పిన చొప్పున ధనము వ్యయపఱచుచు వానిని పీడ నేరక తిరుగుచుండు. మఱియు గుణనిధి వయసునకు దోడు ధనము కూడ వృద్ధియగుచుండెడిది. ధనముతోఁ గూడ హితులును వృద్ధియగుచుండెడివారు. వారితోఁగూడ దన యవివేకమును ప్రబలఁజొచ్చినది. దానికిఁ దోడుగ దుర్వ్యసనములును బ్రబలినవి. లోకమున "సురూపసంపద, ధనము, స్వచ్ఛంద వృత్తి, దుస్సహవాసము" వను నివి యుండిన మానవుఁ డచిరకాలముననే భ్రష్టుఁడగుటకు సందియ మించుకయు నుండదు. ఆరీతినే యనర్థ పరంపర యంతయుఁ గులీనుఁడగు గుణనిధి నాశ్రయించినది. పాపము యాజ్ఞదత్తికిఁగల మిత్రులందఱును వాని ధనమును లాగి యాతని సర్వవిధంబులఁ జెఱుపఁ దలంచుచు నిక్కంపు హితుల మాడ్కిఁ జరించుచున్నారేకాని యందొక్కఁడైన నాతని యభివృద్ధిని గోరువాఁడు లేకపోయెను. మఱియుఁ జిన్నతనంబున బాలు రెంత గుణవంతులైనను, బుద్ధిమంతులైనను, సత్కులప్రసూతులైనను, దుస్సహవాసమునఁ జెడుచుఁ దాత్కాలిక సుఖమును గలుగఁ జేయుచుఁ దమ భావి జీవితమునకును, శరీరమునకును హానిఁ గలుగఁజేయు దుర్మిత్రుల యుపదేశములనే హితములుగ నెంచుచు వారినే గౌరవించుచుందురుగదా! కాని యత్యంతము తమ హితము నాసించు దలిదండ్రులయు, సోదరులయు, గురువులయు హితోపదేశములు దమకుఁ గర్ణకఠోరంబులుగను బ్రకృశోత్సాహ

భంజకంబులుగను నుండుటం జేసి వానిని దమ శ్రవణకుహరం బులం జొరనీయక యుపదేష్టలను నిందించుచుం బ్రకృత సఖులం గూడి యానందింపుచుండుట లోకమున ననుభవ సిద్ధముగదా ?

వివేకహీనుడగు గుణనిధి తన్నుం గని పెంచి సర్వదా తన యభివృద్ధిని గోరుచుం జదువుకొని కుల ప్రతిష్ఠను నిలుపు మని హితవు నుపదేశించు తల్లిని దూరుచు విద్య యనునది లేక దుర్వ్యసనంబుల నారితేరి తల్లికి దుఃఖము నాపాదించుచుండె. తల్లియు గుణనిధి తనకు ముద్దు కొడుకగుటం జేసి యాతని దుర్వర్తనంబునకు మనంబున విచారించినదయ్యు నాతనిని దగు రీతిని శిక్షింప నేరదయ్యె. ఇటుల గుణనిధి గురువులు చెప్పిన విద్యను బూర్తిం గావించి తాను గపట స్నేహితుల యొద్ద నేర్చిన విద్యను వృద్ధి చేయం దొడంగెను. యజ్ఞదత్తుండు తీరిక లేమిచే నిజ సుతుండు పూర్వమువలెం గాక యిప్పుడు విద్యావంతుండై యనవరతము సత్సహవాసమున నిత్యానుష్ఠానములను, నగ్ని కార్యమును జేయుచు వంశ మర్యాదను నిలుపుచున్నాం డనియే యెంచుచుండెడివాడు. తనకుం గల నమ్మకమునకుం దోడు తాను బ్రసంగ వశమున నెప్పుడేని భార్యను బుత్రుని గూర్చి యడుగ మోహంబును వీడంజాలక పాపమా యమ రహస్యమును మరుగు పుచ్చి కుమారుండు చదువుచుండె ననియు నగ్ని కార్యములం దీర్చుచుండెననియు,

సార్థకనాముఁడై నాఁడనియుఁ జెప్పుచు భర్తకుఁ గల నమ్మకమును ద్విగుణము గావించుచుండెడిది. దానికై పాప మా ద్విజుఁడు సంతసించుచుఁ దన కార్యములయం దప్రమత్తుఁడై యుండె.

## — గుణనిధి మిత్రులు —

గుణనిధి గర్భదరిద్రులును, కులదూషకులును, దుష్కులీనులును, నాస్తికులును, గితవులును, బరదార పరధనాభిలాషులును, బిత్రు మాతృ దూషకులును, బరసహనాభావులును, బరనిందారతులును, నగు రామశర్మ, సోమదత్త, విష్ణుదత్త, వీరవర్మ, గోపాలగుప్తులను గలసియుండెడివాఁడు. వీరందఱును నియమితకాలమునకుఁ బోయి నీచవృత్తులఁ జేయుచుండెడివారు. వీరు చిన్ననాటనుండియు గుణనిధిని భ్రష్టునిఁజేయ బద్ధకంకణులైయుండిరి. రామశర్మ యనువాఁడు వీరందరికిని నాయకుఁడు. మిగిలినవారు వాని యాజ్ఞాబద్ధులు. మనగుణనిధి యిట్టిసత్సహవాసము తనకు దొరకదేమో యను భయంబున నాయకుఁడగు రామశర్మకును ననుచరులగు సోమదత్తాదులకును ధనంబు నమితంబుగఁ బారితోషికంబుగ నిచ్చుచు వారు చెప్పు పనులఁ జేయుచుండెడివాఁడు. అకార్యమునకు వెనుదీయని రామశర్మ వృత్తము లోకవిదితము. దానం జేసియే యందఱును రామశర్మను జేరనీయకుండిరి. అట్టి రామశర్మ గుణనిధికిఁ బ్రాణమిత్రుఁడయ్యెను.

గుణనిధి యొకనాఁడు ప్రాణమిత్రుల సెలవుఁ దీసికొని యింటికిఁ దిండికై వచ్చుసరికి రామశర్మ విష్ణుదత్తునిఁ బిలిచి "విష్ణుదత్తా! నేటికి మనకు గుణనిధి ప్రియమిత్రుఁ డయినాఁడు. వానికి మనయెడ దృఢ నమ్మకము కలిగినది. ఇఁక నెవరు బోధించినను గుణనిధి మనల విడఁజాలఁడు. యజ్ఞదత్తుఁడు కోటను గొట్టి ధనమును గడించుచున్నాఁడుగదా? మనము గుణనిధినిఁ జేరఁదీసి. యజ్ఞదత్తుని యిల్లు గుల్ల గావించెదము. గుణనిధి మన జూదమునకు వలయు ధనము నిచ్చును. జూదమాడునపుడు హాయిగ నుండుటకు వలసినన్ని మత్తు పదార్థములను గూడ నాతఁడిచ్చును. మన కాశ్రియలగు వారకాంతలకు గుణనిధి భార్య యొక్కయుఁ దల్లియొక్కయు నాభరణంబులఁ దెచ్చి యొసఁగును. మన కే లోపంబును లేకుండ నా భగవంతుఁ డీ బాలుని జూపినాఁడుగదా? వీనిని బకీరుని జేసి విడుదము. పిమ్మట వీఁడు మనలఁ జేరినను జేరనీయక యిట్టివానిని మఱి యొకనిం జేపట్టుదము కాన మీరును మీ శక్తివంచనలేక యిట్టి వానిని మఱి యొకనిఁ జేపట్టుఁడు." అని చెప్పఁ గుయుక్తులకును, బరవంచనకును బెట్టని కోట యగు సోమదత్తుఁడు వీరవర్మ గోపాలగుప్తులఁ బిలిచి "మీరును మన రామశర్మ వాక్యములను వింటిరిగదా? కాన మనమే బుద్ధిమంతుల మనుచును గాపట్యమున మనల నెవరును సరిపోరనుచును గర్వించి

యుండినఁ గార్యము చెడును. మీ రిరువురు నప్రమత్తులై యుండి గుణనిధి తలిదండ్రులయొక్కగాని మఱి యే బంధువులయొక్కగాని బోధనల కలవడకుండ నిర్ధనుఁడగు వఱకును వానిని విడకుండుఁడు. మీ రే మఱచియుండిన వాని యత్త మామలు కఠినులై వానినొక కాసైన నలవడకుండఁ జేయుదురు. అప్పుడు "ఈనఁగాచి నక్కలపాలు చేసినభంగిఁ" మన కార్యము చెడును. పొండు. గుణనిధిం గలిసి తిరుగుఁడు. వాని నొంటిగఁ దిరుగ నీయకుఁడు. వేగమ పోయి కొంత ద్రవ్యము నిప్పుడేరీతినయినఁ దేవలయునని చెప్పి వానిని ద్రవ్యముతోఁ దీసికొనిరండు. జాగరూకులై యుండి యీయర్థంబు నిచ్చట మఱచిపోండు. రహస్య భేదమును జేయకుఁడు" అని చెప్పి పంపివేసెను. వీరవర్మ, గోపాలగుప్తులు పోయిన తోడనే యిట రామశర్మ, సోమదత్త, విష్ణుగుప్తులుమువ్వురును గలసి తమవ్యాపారముల ముగించుకొని ద్యూతమునకువలయు పరికరములను భద్రపఱచి గుణనిధికై యెదురు సూచుచుండిరి. గుణనిధి యిలు సేరునరికి సోమిదమ్మ వానిని గారాబమునఁ జేరఁదీసి వలయు పదార్థములను దిన వెచ్చము నొసంగె. వాఁడు తల్లి యిచ్చిన దానితోఁ దృప్తిఁ జెందక వీరవర్మాదులఁ జూచి రహస్యముగ బేటికాంతర్గత ధనమును గైకొని వెనుక ముందు లాలోచింపక మిత్రులంగూడి రామశర్మ సమ్ముఖమునకు రా నాతఁడు గుణనిధిని గారవించి ద్యూతక్రీడకుఁ బ్రారంభింప సోమదత్తాదులఁ బురికొల్పి తాను వేడుకఁ జూచుచుండె.

## —♦ గుణనిధి ధనమును మిత్రుల కొసంగుట. ♦—

రామశర్మ యాజ్ఞానుసారము గుణనిధి యొద్ద మజిలీకిచ్చెదమని చెప్పి రామశర్మ సాక్షిగా సోమదత్త, వీరవర్మలు కొంత ధనముం దీసుకొని ద్యూదమాడఁ బ్రారంభించిరి. అక్షకలామర్మవిదులగు సోమదత్త, ప్రభృతులు గుణనిధి తెచ్చిన ధనములోఁ గొంత ఋణముగను మిగిలిన దానిని గెలుపుగను మొత్తముపై నాటికిఁ దెచ్చిన ద్రవ్యమును బూర్తిగఁ జేకొనిరి. యాజ్ఞదత్తి స్నేహితు లడిగిన దాని నిచ్చుటయే కాని మజిల నడిగి పుచ్చుకొననేరఁడు. ఇట్లు జరుగుచుండ సాయంకాల మగుడు గోపాలగుప్తుఁ డెటకేని జని వచ్చి గుణనిధి నుద్దేశించి "మిత్రమా! యీ యూర నిప్పుడమూల్యమగు మద్యము వచ్చియున్నది. దానిని నే నొకసారి రుచి చూచితిని. నీకును రుచి చూప నెంచితిని గాని నా యొద్దఁ బ్రస్తుతము ధనము లేమిం జేసియు నాకు రావలసిన సొమ్ము రాకుండుటం జేసియుఁ గొనలేనైతి. ఆ మద్యమును సేవింపని నరుని జన్మమేల? నీ వొకసారి చవిచూచిన నే నింక దనుక దాని గొప్పతనమును జెప్ప నవసర ముండదు. కావునఁ ద్వరగఁ బోదము రమ్ము" అని చేయి పట్టి లాగుచుండ రామశర్మ "మిత్రులారా! నేఁడు మన దీక్షితులు గారికి రాజుగారు కోటి సువర్ణంబుల దానమిచ్చిరి. వా రిప్పుడ వానిని భద్ర పఱచి రాజ కొలువున కేగుచున్నారు.

మన కందఱకును మన గుణనిధి పారితోషిక మీవలసి యున్నది. దానికి మాయగ దీక్షితులుగారి కీరోజున దొరికిన ధనములో సగము గుణనిధి మన కొసంగును. సగ మాతఁ డుచ్చుకొనును. దానిని వ్యయపఱచిన మన కీ రాత్రికి సరి పడునట్లు నూతన మద్యము లభింపఁగలదు. మీ రిఁకఁ దొందర పడకుఁ" డని చెప్ప సోమదత్తుఁడు రామశర్మ యుక్తికి సంతసించి యప్పటి కప్పుడ యమితమగు సోదర ప్రేమను గుణనిధి యెడఁ జూప నజ్ఞాత కపటుఁడగు గుణనిధి యింటికిఁ బోయి తల్లికిఁ దెలియకుండఁ దండ్రికి దొరకిన కోటి సువర్ణంబుల మిత్రుల కొసంగెను. అంత వారందఱును ధనము నంతయుఁ బంచుకొని కొంచెము మాత్రము వ్యయపఱచి మద్యపానమును జేసి విహరించుచుండిరి.

ఆసమయంబున కీఁదలంచిన యలంకారము లీయమి వేశ్యామాత తన్నుఁ బరాభవింప విష్ణుదత్తుఁడు వచ్చి మిత్రులం గలసి మద్యమును సేవించి "సఖా! గుణనిధీ! నీవు నాకు నిజమగు హితుఁడవై తేని నా కొక్క కార్యమున నిప్పుడు సాయపడవలయును. నాకు సోదరులు లేమి నిన్నే సోదరునిగ నెంచుచున్నాను. ఈ సన్నివేశమున నా కొక యన్న యుండిన నేఁడిట్టి పరాభవము నాకుఁ గలుగునే? సోదరతుల్యుఁడవగు నీవు నాపరాభవాగ్నిని నీ కరుణామృత ధారల జల్లార్చినఁ గాని నాకు నలువురిలోఁ దలవంపు ఘటిల్లును. నీవేమిచేసినను

షరియు. నిన్నేయిప్పుడ నమ్మియున్నాఁడను. అని చెప్పి యెట్టి కార్యమునైనను జేసి తీరెదనని యాతనిచే నొప్పించి వేయేల! గుణనిధీ! నే నలనాఁడు మీయింటికి వచ్చినపుడు మనయమ్మ యాభరణంబులఁ జూచి యధికాశక్తి నట్టి యాభరణంబుల నాయుంపుడు కత్తె కొసంగఁ బశ్యత్తోహరునకు ధనమొసంగి యీ సంగతి మనమున నుంచుకొన జాలక నా ప్రియసఖికిఁ జెప్పితిని. అదియు ననుదినమున నాభరణంబులని మొఱవెట్టు చుండ నా దురదృష్టవశంబునఁ గావలయు నాభరణంబులకై స్వర్ణకారుని దరికేగ వాఁడు మరణించె. నాధనమును బోయి నది. ఆభరణంబులుగూడ లేవయ్యె. నేనందులకై విచారించుచుఁ బ్రియురాలిని సందర్శింప నామెమాత నన్నొక మోసగానిగఁ దలచి యాభరణంబులఁ దెచ్చినఁగాని నాయింటికి రావల దనుచు ననరాని మాటలనాడి త్రోసివేసినది. నేకీదినంబున నాభరణంబులఁ దేనిచో నే దప్పక మృతినందుదు"నని ప్రతినఁ జేసినాఁడ. నాచేతఁ నిప్పుడు ధనములేదు. కొఁలది దినములకు వచ్చును. తోడనే యామొత్తు సరకులఁ జేయించి యమ్మ కిచ్చెదను. నీవంతదనుక నాయాభరణంబుల నీవలయు"నన్న కడు దైన్యంబున జెప్ప గడమవారును మాకును నీయట్టి పరాభవమే సంభవించినది. అయ్యయో! యేమి చిత్రము! మిత్రులమగు మనకందఱికి నొకేసారి పరాభవము వచ్చుట, సమయమునకు మనయొద్ద ధనము లేకపోవుట, మనకు మాట

వచ్చుటయు జరిగినదే! యని చెప్పి విచారించుచుండ నాయకుఁడగు రామశర్మ "మిత్రులారా! యేల విచారించెదరు? కొండను దలక్రింద నుంచుకొని ఱాళ్ళకు వెదకు వెఱ్ఱులవలె మీరును, శ్రీమంతుఁడగు గుణనిధియుండ విచారించెద రేల? ఆతనియింట నాభరణములు వేలకొలఁది గలవు. ఇప్పుడవానిని దెచ్చి మీకొసంగఁ గలఁడు. కష్టకాలమున సాయపడని మిత్రుఁడుండిన లాభమేమి? మన గుణనిధి యట్టివాఁడుగాఁడే? యనిచెప్పి యించుక గుణనిధిని బుజ్జగించె. తోడనే గుణనిధి యింటికేగి చిరకాల సముపార్జితంబులగు నాభరణంబుల రహస్యంబుగఁ దెచ్చి నిజహితుల కొసంగి తానును వారితోఁ గలసి వేశ్యాలంపటుఁడై తిరుగుచుండె. అట్లు ద్యూతమునకును, పానమునకును, వేశ్యలకును, దండ్రి గడించిన యాభరణంబులను, ధనమును మఱికొన్ని వస్తువులను దల్లికిఁ దెలియకుండఁ దెచ్చి మిత్రులతోఁ గలసి వెచ్చించుచు రామశర్మాదుల మెప్పువడయుచుండె.

## —♦ సోమిదమ్మ విచారము. ♦—

మందభాగ్యురాలగు సోమిదమ్మ యీనడు కెన్నఁడును సుతుని జూడ బాగుగ గుర్తింపమిం జేసి యీ సన్నివేశమున నింటఁగల సొత్తంతయుఁ బోవుటకు నచ్చెరువంది సొత్తుపోవుటకుఁ గారణమరయుచుండె. అంత నా వీధిఁగల యమ్మలక్కలందఱును గుణనిధి దుష్ప్రవర్తనమును గూర్చి ముచ్చ

టించుకొనుచుండఁగఁ గర్ణాకర్ణికగ విని సుతుఁడు భర్త సంపాదించిన యాస్తినంతయు దుష్టులగు రామశర్మాదులఁ గలసి పాడుచేసె నని తెలిసికొనఁ గలిగెను. వివేక హీనురాలగు నా యువిద తన యనుంగు బుత్త్రుఁడు చదువు లేకపోయినను బ్రతికియుండినఁ జాలుననియే తలంచెను. గాని సర్వస్వమును బాడుచేయునని గాని వానివలన దనకు హాని కలుగునని కాని గుర్తింపఁజాలదయ్యె. ఇఁక నిప్పుడేమి చేయుటకుఁ నామెకుఁ దోపదయ్యె. కుమారుఁడు దుష్ప్రవర్తనమును వీడి సత్సంగతిఁ జేకొనుజాడయు నగపడదాయె. భర్తకుఁ దెలిసిన దురహంకారుఁడును గోపమునఁ దూర్వాసునిఁగూడ ధిక్కరింపఁగల వాఁడును నగు నాతఁ డేమిచేయునో? యని భయంపడుచుఁ గన్నీరు మున్నీరుగ నేడ్చుచు "నయ్యయో! పుత్త్రులు లేకున్నఁ బున్నామనరకమును బొందుదునే? నాకేల యీ పుత్త్రుఁడు పుట్టె? నేఁ బుత్త్రులు పుత్త్రులని యెందులకుఁ దపమాచరించితిని? నాతపమున కా యీశ్వరుఁ డేల మెచ్చవలయును? మెచ్చినను సుపుత్త్రు ననుగ్రహింపక యీదుష్టునేలఁ బ్రసాదింపవలయును? అయినను దుష్టుఁడని నేనేల శిక్షించి వీని దౌష్ట్యమును మాన్పఁదగు యత్నముం జేయక గారాబమునఁ జూడవలయు? చూచినంత మాత్రాన వీఁడు దుష్టులనే చేరవలయునా? వీనిని శిక్షింప దీక్షితున కేలఁ దీరికలేకుండ నుండవలయును? దీక్షితులే పుత్త్రుని శిక్షించు

చుండిన బాగుపడి యుండునేమోగదా? నిర్భాగ్యురాలనగు నాపై భారముమ మోపి సర్వ స్వాతంత్ర్యము నొసంగి నేనన్న మాటయే వేదవాక్యమని యెంచు దీక్షితునియెడ గుణనిధికై యింతంతనరాని యపచారమును గావించితినే? వంశమును బాడుచేసితినే? యెప్పుడడిగినను జదువుచున్నాఁ డనియే చెప్పుచు నసత్యదోషమునకుఁ బాత్రురాలనైతి గాని యాథార్థ్యమును జెప్పి పుత్త్రుని, నన్నును, గులమును రక్షించుకొనఁ జాలనైతినిగా? హాపరమేశ్వరా! యేటిదిక్కు? నాసుతుండు భ్రష్టుఁడయ్యెఁగా? అయ్యయ్యో! నాజేసిన మోసమును గుర్తింపఁజాలక నాయన్నయు గుణవతియును నిజసుతను సుఖించునని యెంచి కొండంత యాసతో నాసుతుని కిచ్చెనే? నేఁజేసినముద్దుగదా? యింతకుఁ దెచ్చినది. ఇట్టిసుతునివలనఁ గలుగు పరాభవమును భరించుటకంటె గొడ్రాలనైన బాగుండునే" యనుచుఁ బరిపరి విధంబుల నుపాయాంతరమును గాననేరక యెట్టకేలకుపాయంబు నొండు వెదకి యిఁకనైన బుద్ధిచెప్పిన బాగుపడునేమోయని యాసించి పోయిన యాస్తికై వగవక భర్తయాస్తిని గూర్చి యడిగిన సమాధానము నీయనెంచి దుఃఖమును మాని పిల్లఁడు వచ్చు నరికి వ్యాపారాంతరశూన్యయై చెప్పవలసిన మాటల నాలోచించుచు నొకచోఁ గూర్చొనియుండె.

రెండవ ప్రకరణము సమాప్తము.



# గుణనిధి.

## మూఁడవ ప్రకరణము.

### — గుణనిధి యింటికి వచ్చుట. —

గుణసిధి రామశర్మాదులకు సర్వస్వము నిచ్చి కొన్ని యాభరణములను ద్యూతసమయంబున రామశర్మ యొద్ద తీసికొనిన సొమ్మునకై కుదువయుంచి యింటికి వచ్చుచుండెను. నాఁడిచ్చెదమని పుచ్చుకొనిన సొమ్మునుగూర్చి విష్ణుదత్త ప్రముఖులు మఱచి సర్వశూన్యునిగ భావించి వానిని జూచి యసూయా ముఖరితులు కాఁజొచ్చిరి. పాప మీ బాలుఁడేమియు నెఱుఁగక యింకను వీరు తన్ను గౌరవింతురనియుఁ దన యొద్ద బదులు పుచ్చుకొనిన ధనమును మఱల నిచ్చివేతురనియు నమ్మియుండెను. అట్లు ధనహీనుఁడై యింటికి వచ్చు దీక్షితుని పట్టిని గని జనులు "సద్వంశ సంభూతుఁడగు దీక్షితుని

సుతుండు వంశదూషకుండై సొమ్మెల్ల వ్యయపఱచుచున్నాఁడు; "ఘ దీక్షితుని పాలిటఁ గాల సర్పమై జనించె" నని యేమే మో తమ యిచ్చవచ్చి నట్లనుకొనుచుండ గుణనిధి వినివినమి యిలు సేరెను. ఆనాఁడు గుణనిధి యింటికి వచ్చుసరికి సోమిదమ్మ యిదివఱ కెన్నఁడును జూపని యసూయను, మోమున వైవర్ణ్యమును, మౌనమును వహించి తనకుఁగల దుఃఖమంతయు మూర్తీభవించి యీమె మోమునఁ దాండవ మాడుచున్నదా యను నట్లుండఁగని భయాధీన మానసుఁడై జననిని సమీపించెను.

—♦ తల్లి గుణనిధిని నిందించుట. ♦—

గుణనిధి భయ విహ్వలుఁడై తన్ను సమీపింపఁజూచి "నాయనా! గుణనిధీ! నీవు నేటికి సార్థక నాముఁడ వైతివి. ఇల్లు గుల్లచేసితివి. నాకడుపుఁ జెడఁబుట్టితివి. నీవేమో బుద్ధిమంతుఁడవై మమ్ముద్ధరింపఁ గలవనియు మదేకపుత్త్రుఁడ వనియు నెంచి కంటికి రెప్పవలె రక్షించుచుండ నీవు నా చూపు వాత్సల్యమునకుఁ దగు ఫలమును గల్పించి మాతృఋణమును దీర్చుకొంటివి. నేను నీకై యనేకవిధంబుల శ్రమపడుచు నవృ తంబులాడి యెన్నటికైన బుద్ధిశాలివై నన్నును, మీతండ్రిని సంతోష పెట్టెదవని మనమున నువ్విళ్లూరుచుండ నీవు 'దుర్జన సహవాసముఁ జేసి మీతండ్రి చిరకాలమునుండి కాయక్లే శంబులకోర్చి సముపార్జించిన సొత్తునంతను కొలదికాలము

లోనే నామమాత్రావశిష్టముగఁ జేసితివి. నీవు చదువుచున్నా వనియు నిత్యకర్మాచరణమును జేయుచున్నావనియు నే బొంకి మీతండ్రికిఁ జెప్పుచున్నదానను. మఱియు నీకెన్నియో సారులు బుద్ధులు సెప్పితిని. నీకు నామాటలు రుచించినవి కావుగా? ఇఁక నీకును నాకును ఋణము దీరినది. మీతండ్రి వచ్చువేళ యయినది. ఇంట నే వస్తువును లేదు. మొన మొన్నఁ దెచ్చిన కోటి సువర్ణంబుల నే పాడుముండకొడుకుల వాతనో పెట్టితివి. నా మేని రవణంబుల నన్నింటినిగూడఁ దీసి నీయిచ్చవచ్చినట్లు గావించితివి. అగ్నిసాక్షిగఁ జేకొనిన భార్యను వీడితివి. సంధ్యాది కృత్యంబులమానితివి. ఇట్టినిన్నుఁ జూచిన మీ తండ్రి మొదలు మాడ నిన్నును, నన్నును మంటఁ గలుపును. మనకిఁకఁ దిలోదకంబె ప్రాప్తంబు. మందభాగ్యురాలనగు నాకడుపునఁ బుట్టి నీ తండ్రి ప్రతిష్ఠను గూడఁ బోఁగొట్టినాఁడవు. అని దుఃఖవశంబున నోడ లెఱుంగక యేమేమో పల్కుచుండ నించుక పశ్చాత్తప్తుఁడై గుణనిధి తల్లి యెదుట నిలువంబడి కన్నీరు కాల్వలై పాఱ నేడ్చుచుండె. కన్నతల్లియాట సోమి దమ్మయుఁ బిల్లవాఁ డేడ్చుచుండ సహింపలేనిదై తనకోపమును జల్లార్చుకొని యేడ్పు బాలు నోదార్చి హితోపదేశముం జేయ మొదలిడెను.

—♦ హితోపదేశము ♦—

తండ్రీ! యవివేకంబునఁ బోయిన దినంబుల బోనిమ్ము. ఇఁకనైన నా బుద్ధి విని సుఖంబుండుము. నీ కేలోపమును

లేదు. సంపద పోయినను మఱలఁ జేకూరును. మీ తండ్రి నిన్ను శిక్షింపకుండఁ జేసి నేనేదో సమాధానమునిచ్చి యాతని కోపాగ్నిని జల్లార్చెదను. నీ వీ దినమునుండియు సదాచార సంపన్నులును, సకల విద్యా పారంగతులును, సోమయాజులును నైన మీ కులమువారిని సత్యవాక్పాలకుఁడును, రాజపూజితుఁడును, సద్గుణయుఁతును నగు నీ తండ్రిని; పతిభక్తిరతను, పుణ్యవ్రతను, గ్రామతలలో వాసికెక్కినదానను, సద్గుణభూయిష్టను నగు నన్నును; సకలవిద్యా పారంగతులై నగరంబున వాసిఁజెందిన నీ తోడివారిని; నీ వయసును, ననుకూలవతియగు నీ ధర్మపత్నిని దలఁచి దుశ్చేష్టల మానుము. సత్సహవాసము జేసి సత్యరతుఁడవు గమ్ము. మఱియు సద్గుణగరిష్ఠులగు నీ యత్తమామ లనేక విధంబుల నీ దుర్వ్యాపారంబునకు వగలం బొగులుచున్నారు. వారిని గష్టపెట్టుట నీకు న్యాయమే? అదియునుగాక నీ వనుదినము ధూర్తులంగలిసి వెఱ్ఱివై యూరఁ దిరుగుచుండుటంజేసి రాజు నీ దుర్వ్యాపారంబును గుర్తించెనేని యప్పుడ నీ తండ్రిని వీడును. దాన యశోభంగమును, ధనహానియుఁ జేకూరును. వీడుటయే కాక యిదివఱ కొసఁగిన మాన్య క్షేత్రములనుగూడఁ జేకొనును. మీ తండ్రీ నెవరును గౌరవించరు. దుర్మార్గుఁడవై నీ వింటనుండుటంజేసి యతిథులును రారు. మీ తండ్రి చిరకాల మా యుమామాధవునిఁ బ్రార్థించి నిన్నుఁ బడసెను. ఇదివఱకు నీకై విచారించుచున్న తండ్రి మనం

బలరారఁ జేయరాదే? లోకములోనివారందఱును నీవు దుష్టుఁడ వౌట నెఱింగి ప్రత్యహంబును శాప్ట్ర్యమునెల్ల నా మీఁద నుంచి నిందింతురు. నీవలన నాకును నలువురిలోఁ దలవంపు ఘటిల్లును. యుక్తవయస్కుఁడ వగు నీ విట్లు చరించుచుండ ధనమూ పోవును. మానమును జెడును. నిందయుఁదల కెక్కును. కుల ప్రతిష్ఠయును జెడును. జనకులును నీకారణంబున గౌరవహీను లగుదురు. నీ యొక్కనివలనఁ గలుగు నీ యనర్థ పరంపరను ఛేదింప యత్నింపవా? తండ్రీ! యిఁకనైన నా బోధనల నాలింపుము. లెమ్ము. వ్యసనరతుండవు గాకుము. ఇప్పటికి నా మాటలు కర్ణశూలాయమానము లైనను ముందైనను గర్ణరసాయనములు కాక మానవు. నాఁడే నీతండ్రి సుతుఁడు దుష్ప్రవర్తనుఁడైన నిన్నును, వానిని దరిమివేసెదనని చెప్పె. ఇప్పు డాతనికి నీ ప్రవృత్తి తెలియదు. తెలిసినచో మన యిరువుర నిప్పుడ నిర్వాసితులఁ జేయు. నా మాట నమ్ముము. బుద్ధిమంతుఁడవు గమ్ము. కన్న కడుపౌట మిగుల దుఃఖించుచున్నది. లెమ్మనుచు నింక ననేక విధంబుల బోధింప నయ్యావి తన మనంబునకు సరిపడమింజేసి యేమియు ననక యూరకుండె. నవయౌవనమున దురోదరము, వేశ్యాలంపటము, చౌర్యము, మృగయ యివి యలవడెనేని వానిని దప్పించుకొన శక్తు లెవరునుగారు. కావున బుద్ధిమంతులు కామక్రోధాద్యరిషడ్వర్గమునకును, వ్యసనపరంపరకును లోనుగాక వానిని దమవశంబున

నుంచుకొందురు. గుణహీనులు వానిని స్వాధీనులై యవియెట్లు నడిపించిన నట్లు నడతురు. గుణనిధిని తల్లి పరిదేవనముముందుఁ జీకాకు పెట్టినది. ఉపదేశము మాత్రము మనమును ద్రిప్పఁజాలక పోయెను.

—♦ గుణనిధి మిత్రులచే నవమానింపఁ బడుట ♦—

తనకుఁ దల్లి యుపదేశము రుచింపమియు, వ్యసనపరం పర తన్నాకర్షించుటయు, మిత్రులు తనకింకను సెలవొసంగక పోవుటయును దన్ను వేధింప మఱునాఁడు సూర్యోదయంబగుడు లేచి యింట నంతటను ధనమునకై పరిభ్రమించెను. కాని తల్లి తెలివిఁ జెప్పుకొని హాతశేషమును భద్రపఱచి యుండుటచే నొకకాసైన లభింపమికి మిగుల విచారించుచు మిత్రులఁజేరె. సోమశర్మాదులును దాము సఫలమనోరథులగుటకును, దీక్షితుని గృహము గుల్లయగుటకును మనంబున సంతసించుచు నొకచోఁ గూర్చుండి యుండ గుణనిధి వచ్చుచుండె. అత్తఱి విష్ణుదత్తుఁడు రామశర్మ నుద్దేశించి “యదెగుణనిధి వచుచ్చున్నవాఁడు. వాని ముఖవైఖరిఁ జూడ ధనము లేక శూన్యహస్తుఁడై వచ్చు చున్నట్లు కాన్పించుచున్నది. ఇఁక వీఁడు మనలఁ జేఁయుండిన ముప్పు సంభవించును. మన మిప్పుడు వీనిని బరాభ వించితిమేని మనల నీ పిశాచము వదలును” యని చెప్ప సోమదత్తుఁడు “మన మీతని ధనపిశాచమును వదల గొట్టితిమి. మన యాగ్రహ మీ పిశాచమును వదలగొట్ట

ధనమిమ్మనుచును, లేఁచో నీ సుతను పీడుదు ననుచును జెప్పుటకా యిదివరకే యా పిల్లను పీడినాఁడు. ఇప్పుడు మో మోటమి పీడి యెట్లు వానిని దర్శింపఁగలడు? అట్టి సమయఁబునఁ దల్లి యుపదేశము స్మృతిపథమునకు వచ్చినది. విచారగ్రస్థుఁడై యొకచోఁ గూర్చొనియుండెను. ఆ సమయమున రామశర్మ వచ్చి "యేమండీ! గుణనిధిగారూ! నా సొమ్మును జతపెట్టినారా? లేదా? మీ యవసరమునకు నే నిచ్చినపుడు మఱల నా యవసరమున కీవలదా? రాజపురోహితుని పుత్త్రుఁడవగు నీవే యిట్లు చేయ గర్భదరిద్రుఁడ నగు నేను సొమ్మెట్లు తెచ్చెదను? మిత్రులసు యెంచి సొవిమ్మయ మంచిపని చేసితిరి. లెండి. పోనీ! యిప్పుడైనను నా సొమ్మిచ్చివేయు" డని పరుషంబుగఁ బలుక గుణనిధి మెట్టకేలకు సాహసించి "అయ్యా! మీ రెందులకు వ్వరపడి యెదరు? మీరు చూచుచుండగనే సోమదత్తాదులకు గొంత ధనమును బదులుగ నిచ్చితినిగదా? వారిచ్చిన తోడనే మీ సొమ్మిచ్చెద. దానికై యమూల్యాభరణమును మీయొద్ద నుంచుకొన్నారుగదా? దీనికా యిన్ని విధంబులఁ బల్కుచున్నారు" అని చెప్పుచుండ సోమదత్తాదులు వచ్చి "యయ్యా! గుణనిధిగారూ! మీరు కొంచెము మతి చెడిన వారివలెఁ బల్కుచున్నారు. మీ కేడ? ధనమేడ? మాకీయుడమేడ? చాలు చాలు. వెఱ్ఱిమాటలాడకుము. పొమ్ము. మొదటనుండియు మేము వలదనుచుండ రామశర్మ నీవు

యోగ్యుఁడవనియు స్నేహపాత్రుఁడవనియుఁ జెప్పి నిన్నుఁ జేర దీసినాఁడు. దాని కిదియా ప్రత్యుపకారము? రామశర్మా! బుద్ధి వచ్చినదా? ఇఁకనైన నీదరిద్రుని విడెదవా? మంచి హానినే తెచ్చితివి. మన సొమ్మంతయుఁ దిని మీఁదుమిక్కిలి మనకు ఋణమిచ్చితి వనియు నిచ్చినారు కారనియుఁ జెప్పుచున్నాఁడు. ఇట్టి మిత్రు లుండిన మన కేమి లోపము? నీవికఁ బెద్దవనుచు నిట్టి నిర్భాగ్యులను, కృతఘ్నులను జేరఁదీయకుము" అనుచుఁ జెప్పి నిందింప మొదలిడెను. గుణనిధి తనమనంబున భయశోకంబులు దూగాడ నిశ్చేష్టుఁడై యుండెను. గుణనిధి తన్ను రామశర్మాదులు నిందించి ధనము నడుగుచుండఁ జేయునది లేకయు, వారిని సాధించు నుపాయ మాలోచింప లేమియు విచారించుచుండ రామశర్మ "ఏమయ్యా! గుణనిధీ! నాధనము నీయఁ దలఁచుకొన లేదా? సోమదత్తాదులు నీకు బాకీలేదనుచున్నారే? నీ వామాటను వినుట లేదా? యిఁక నాధనము నెట్లిచ్చెదవు? నీవేమో సంపన్నుఁడవని యెంచితిని గాని యింత దరిద్రుఁడవని యెరుగనైతి. ఇఁక నీదారిని నీవుపొమ్ము నా ధనమునకుఁ దిలోదకము లిచ్చి యనవరతము నీజీవమున కేడ్చుచుండువాఁడ. చేరఁదీసి చనవిచ్చినందులకుఁ దగినబుద్ధిఁ జెప్పితివి యని నిందించుచు వానిని వీడి పరివారమును వెంట నిడుకొని తొలినాఁడాతఁడు కుదువగానుంచిన యుంగరమును విక్రయించుటకై యంగడికిఁబోయెను. గుణనిధి మిత్రులు చేసిన యపకారమున కెంతయు దుఃఖించుచు నందందుఁ బిచ్చివానివలెఁ దిరుగుచుండె.

—♦ యజ్ఞదత్తుని విచారము ♦—

యజ్ఞదత్తుఁ డా నాఁడు రాజభవనమునుండి యింటికి వచ్చుచు బూర్వపు మార్గమును గాక యా పణవీధినుండి వచ్చుచుండెను. ఆసమయంబుననే రామశర్మ గుణనిధియొద్దఁ దీసికొనిన హస్తాభరణమును విక్రయించుచుండెను. యజ్ఞదత్తుఁ డద్దానిని జూచి యది తనదని గుర్తించి రామశర్మ దౌష్ట్యము దెలిసినవాఁ డౌట నాతని సమీపించి "ఓయీ! నీ కీ యుంగర మెట్లు లభించినది? మహారాజుగారు నాకు దీనిని బర్వకాలమున ధారాపూర్వకముగ నొసంగిరి. నీవు దీని యాదార్థ్యమును జెప్పితివా సరి. లేనిచో నిప్పుడ రాజభవనమునకుఁ గొంపోయి నిన్నుఁ గొఱత తీయింతును. చెప్పుము నిజ"మని గద్దించుచుండ రామశర్మ "అయ్యా! తా మెందుల కూరక కోపపడియెదరు? నేను నీ యింటఁ బ్రవేశించి దీనిని జేకొనలేదు. మీ గుణనిధి మాతో నిన్న జూదమాడి దీనిని నా కోడినాఁడు. ఇదియేకాక తల్లి యాభరణంబుల నన్నిటిని దీసి పన్యాంగనల కొసగెను. వేయేల! నీ సర్వస్వమును బాడుచేసి కులదూషకుఁ డైనాఁడు. ఇందు నా నేర మేమియు లేదు." అని చెప్పి తనపని తాను జూచుకొనుచుండెను. రామశర్మ నిజసుతుని వృత్తమును జెప్పినతోడనే లజ్జా క్రోధంబు లహమహమికలై మనంబునఁ బెనఁగొన మూర్ధంబున నుత్తరీయమును వైచుకొని "యయ్యయో! యే

యుంగుళీయకమును రాజునకు నిట్టి యుపదానముగ నిచ్చెనో?" యే హస్తాభరణమును రాజు ధారాపూర్వకంబుగ యోగ్యుఁడగు నా కొసంగెనో? యే యుంగరమును నేను బ్రేమపూర్వకంబుగఁ బాణప్రియ కిచ్చితినో? దేనిని దల్లి సమయముం జూచి సుతునకిచ్చెనో? యా రత్నఖచితాంగుళీయకమిపుడు దుష్టుఁడును, జూదరియు, నాచారహీనుఁడు నగు రామశర్మయంగుళి నలంకరించినది. అదియేకాక రా జొసంగిన యాభరణములు వేశ్యల నలంకరించినవట. ధనమంతయు జూదరులఁ జేరెనట. ఇది యంతయు నా సుతుని సామర్థ్యమట. చిన్ననాటినుండియు వీనిని ముద్దుచేసి నా భార్య పాడుజేసినది. వీఁడును గులమును బాడుచేయఁ బుట్టి దుష్టులఁ గూడి నా సర్వస్వమును బాడుచేసి యాచారహీనుఁడై సంచరించుచున్నాఁడట. అహహా! యోగ్యురాలని నమ్మి సర్వస్వాతంత్ర్యము నామె కొసంగ నామెయుఁ, బుత్త్రుఁడును గులమును బాడుచేసిరి. ఇఁక నే నేమి చేయువాఁడను? ఇట్టి కుపుత్త్రుఁడు నా కేలఁ గలుగవలయు? పుత్త్రుఁడు పుత్త్రుఁడని పలవించు నా కిట్టి సుపుత్త్రుఁ డుదయించినాఁడు. తీరిక లేమిం జేసి నే వానిని దగురీతిని శిక్షింపక యా భారమును దల్లిపై నైవ నామె యాతని నీరీతిగ శిక్షించినది. ఏమిసేయుదు? ఇట్టివాఁడు నా కుమారుఁడని యేరీతిగఁ బురమునఁ జెప్పుకొని తిరుగువాఁడ? ఇదివఱకే యీ దుష్టుఁడు నేను దీక్షితుని పట్టినని చెప్పుకొనుచుఁ దిరుగు

చుండెఁ గాఁబోలు ? ఇఁక నలువురమోమును నే నెట్లు చూడఁగలను? అహహా ! నా ప్రతిష్ఠ నేటితోఁ జల్లారినదా ? ” యని మనంబునఁ దల్లడిల్లుచు నిలుసేరి “సోమిదమ్మా ! యిటు రమ్ము. నీ గుణనిధి యెటనున్నాఁడు ? నీ వాఁడు రాజదత్తాంగుళీయకమును జేకొంటివిగాదా ? దాని నిప్పుడు కేల ధరింపనిదే హావిద్వారముఁ జేయను. కాన దాని నిమ్ము” అని యడుగ దీక్షితాయని “నే దానిని భద్రము చేసితిని. కుతుప కాలమతిక్రమించుచున్నది. మీకును సంధ్యాసమయ మాసన్నమయినది. అగ్ని కార్యమాచరించి యభవు పూజగావించి వేగము సిద్ధముగండు. ద్వారదేశమునఁ బెక్కండ్రతిథులు మీకై నేఁడు వేచియున్నారు. వంటకములు చల్లారిన రుచులు తప్పును. మీయుంగరమును దీయుట కిప్పుడు వలను పడదు. పావకాళముగఁ జేసియున్నదానను. దానికై విచారింపకుఁ”డని చెప్ప నాగ్రహోయత్తచిత్తుఁడై పండ్లు పట పటం గొఱుకుచుఁ గటకటంబడి కోపాగ్నిజ్వాలలు మోమునఁ బ్రజ్వరిల్ల భృకుటీకృతనేత్రుఁడై “యోసీ! పాపీ! నీవంతయు యథార్థము నే వచియించుచుంటివే ? నిజముగ నీవే పత్పుత్త్రునిఁ కన్నదానవు. సత్యవ్రతవన్న నీవేకదా ? పతివ్రతవన్నను నీవ కాదే? మొన్నఁడు స్వాధ్యాయమనునిది యేమో యెఱుఁగనివాఁడు చదువుచున్నాఁడని చెప్పుట నీ కుచితమని తోఁచినదా ? యింకను స్నానమన్న నెఱుంగని పిల్లవాఁడు స్నానమాడెనని చెప్పుట

తగవనియా నీయుద్దేశము? సంధ్య వార్చనివాఁడు వార్చుచున్నాఁడని చెప్పుట నీకు నీతియా? యెన్నఁడు నగ్నివేల్చని బాలుఁ డగ్నికృత్యము చేయుచున్నాఁడని చెప్పుట న్యాయమా? నీవిటుల నసత్యములాడి యేమి ఫలమనుభవించితివి? నేనెన్నిసారులడిగినను సుతుఁడు బుద్ధిగనున్నాఁడనియే కదా చెప్పుచుంటివి? జూదరులఁ గలిసి నాసర్వస్వమును వేశ్యలకు ధారవోసినాఁడు. నీమాటనమ్మి కానక కన్నసుతుని భ్రష్టునిఁ జేసుకొన్నాఁడను. ఇఁక నేనేమి సేయువాఁడ? నాకేకీర్తియైనను సుఖము లేకపోయెఁగా? ఉత్సవ దినముం బైనను దీయక భద్రపఱచిన మంజిష్ఠి యేడఁ బోయెనో కదా? అమూల్యంబగు బంగారు భృంగారకంబు వేశ్యలయింట నున్నది. పసిడియొడ్డాణ మే తలిరుఁబోడినో యాశ్రయించినది. నా సాలభంజిక యేడఁ బోయెనో కదా? నాకోటి సువర్ణంబు లెందు డాగినవో కదా? నాహస్తాభరణము జూదరిని జేరినదికదా? నాతూగుటుయ్యాల యేయలనాగనాశ్రయించినదో కదా? నాకష్టార్జితవిత్త మేనికృష్టాత్ముని జేరినదో కదా? నీవును, నీకుమారుఁడును గలిసి కులముఁ బాడుచేసితి. నిర్భాగ్యురాలవగు నిన్ను నమ్మటంజేసి నేనపుత్త్రికుఁడనైతిని. నాపుత్త్రుఁడు నేఁడు చచ్చినాఁడు. ఇప్పుడ గుణనిధికిఁ దిలోదకము లిచ్చువాఁడ. వంశ దూషకుఁడగు వీనిని విడి కులమును గాపాడుటయ యుక్తము." అనిపలికి యాహ్నిక క్రియాజాలంబు నిర్వర్తించి భార్య నిఱువెడలఁగొట్టి గుణనిధికి

నివాపాంజలు లొసంగి యాగ్రహము నుపసంహరించుకొని మఱికొన్ని దినములకు శ్రోత్రియుని సుతను బరిణయంబై యామెతోఁ గాఁపురము జేయుచుఁ గ్రతువులఁ జేయుచుండె. భార్యయు భర్తృకృతావమానమునకును, సుతుఁడు భ్రష్టుఁడగుటకును సహింపఁజాలక యేరికిఁ గానఁబడదయ్యెను.

—♦ పు రం ధ్రు లు : ♦—

యజ్ఞదత్తుఁడు గుణనిధిని వీడెనను వార్త నలుగడల వ్యాపించినది. దీక్షితాయిని యదృశ్యమగుట యావీధి యమ్మలక్కలందఱును విని యక్కడక్కడఁ జెప్పజొచ్చిరి. తోడనే యమ్మలక్కలందఱుఁ గలిసి వారిలోవారు "అమ్మమ్మ ! మన సోమిదమ్మను దీక్షితులు వీడినాఁడట ? ఇదేమి పాపమమ్మా ? మనకందఱకును మార్గదర్శకురాలై యనేక నీతులను బోధించు దీక్షితాయిని కెంత యాపద ఘటిల్లె నను వారును; దీక్షితులేల విడువవలయును ? నేరమేమి ? ఇదేమిటమ్మా ! ఇన్నినాళ్ళు కాఁపురముఁ జేసియు నేనేరము లేకుండఁ గనే వీడుట యెన్నఁడును గని విని యెఱుంగుదుమే ? యని యనుకొనుచుండ మఱికొందఱు కారణములేకేమి ? గుణనిధిని గని లేక లేక పుట్టినవాఁడగుట నధికముగఁ బ్రేమించుచుండెడిది. ఎన్నిసారులు చెప్పినను వానిని శిక్షింపకుండుటం జేసి వాఁడు మన యూరఁగల రామశర్మాదులంగూడి ధనమును గాల్చి దుర్వ్యసన పరుఁడౌటంగని సోమిదమ్మయే చెరచినదని యెంచి

చెడినందులకు, బుత్త్రుని జెరచినందులకు సోమిదమ్మను దీక్షితులు వీడినాఁడు. కావలసినదే శాస్తి యిరువురకును ననెడివారును; అయ్యయో! దుష్టుఁడగు రామశర్మ యూరంగల పిల్లలనందఱిని బాడుచేయుచున్నాఁడమ్మా! యనువారును; రామశర్మకును గుణనిధికిని సమావేశమెట్లుకలిగినది? కలిగినది బో సోమిదమ్మ వారింపలేకపోయినదా? పోనీ! సోమిదమ్మ యుపేక్షించిన దీక్షితులేల యుపేక్షింపవలయు ననువారును; అదేమి పాపపుజన్మమెత్తినాఁడో కాని రామశర్మ తాను భ్రష్టుఁడగుటయే కాక యనేకులఁ బాడుచేయుచుఁ గొంపలను దీయు నుద్యమములఁ జేయుచున్నాఁడమ్మా! వీనిజన్మముకాల; ఇందఱిని బాడుచేయుటకంటె వీఁడు చచ్చిన బాగుండునను వారును; వాఁడొకఁడేకాదమ్మా! వానికి సోమదత్తుఁడు మున్నగు సహచరులు నల్వురుకలరట; వారంఱును గలిసివారికంటె నుత్తములగు బాలురను జేరఁదీసిపాడుచేయుచున్నారు.వీరిని శిక్షించువారు లేరను వారును; ఇదేమమ్మా! రామశర్మాదులను దిట్టెదరు? పాపము! వారేమిచేసిరి? మీతో మేము స్నేహముఁ జేయుమని యీ పిల్లలినవారు వీరిని బలవంతపెట్టికొంపోయిరా? కొంపోయిరిబో వారి తలిదండ్రులేల యొప్పుకొనవలయు? మొదట ముద్దుచేసి వాఁడేమి చేసిన నుపేక్షించుచుఁ జెడిన తరి నేరమితరులయం దారోపించి వారల నిందించుట యేటి నాయమమ్మా! యనువారును, లేదమ్మా! యీ భ్రష్టు

ముండా కొడుకులగు రామశర్మాదుల కేమియు లేదు. నిన్న మొన్నటివఱకు నధికారుల యింట వంట వండుచు వారి యిండ్ల దొంగతనముఁ జేయ మొదలిడ వారు వీరిని వెడలఁగొట్టిరి. దానంజేసి యీ దుష్టుల నెవరును జేర నీయకున్నారు. ఈ దుర్మార్గులు బుద్ధియను దాని నెఱుఁగక దాష్ట్యమునకు వెఱవక ముండలకును, జూదమునకును డబ్బు లేమింజేసి యిట్టి యమాయకపు బాలురఁజేరఁదీసి పాడుచేయుచున్నారు. ఇట్టివారి నురి దీయించినను పాపము లేదనువారును; మనకెందుకమ్మా వారి జోలి ! ఇది రామశర్మాదులకుఁ దెలిసినఁ బగఁబట్టి యేయపకారములను జేయుదురో ? యనువారును; మన సోమిదమ్మ భర్తృకృతావమానమునకు సహింపలేక యే నూతినో గోతనో పడిచచ్చె. లేనిచో నెవరికిఁ దెలియకుండ నెటకేగె ? పుట్టినింటికైనఁ బోవుట లేదే ? యనువారును; పోనీయమ్మా ! తల్లి పోయినదిగదా ? గుణనిధి యింక బాగుపడఁగలఁడను వారును; వాఁడి బ్రతుకు బ్రద్దలు కాను. ఏమైననేమి ? కనకమువంటి కన్నతల్లి కాఁపురమునకు ముప్పు తెచ్చెనుగదా ? కళకాంతులు లేకయుఁ దిండిలేక మలమల మాడుచుఁ బరుల మోములఁ జూడనేరక యెందో పడియున్నాఁడను వారునునై తమలోఁ దామేమేమో యనుకొనుచుండ సాయంకాలమగుడుఁ దమతమ గేహంబులకుఁ జనిరి.

మూఁడవ ప్రకరణము సమాప్తము.

---



# గుణనిధి.

## నాలవ ప్రకరణము.

### గుణనిధి విచారము.

గుణనిధి తన్ను రామశర్మాదులు పకీరునిఁ జేసి తుదకు నిందించి చేరనీయనందుల కెంతయు విచారించి పశ్చాత్తప్తుఁడై "యింక నింటికిఁబోయి మాయమ్మ చెప్పినట్లు చేయువాఁడ. నేటికి రామశర్మాదులు దుష్టులని తెలిసినది. ఇఁక వారిని నాదరి జేరనీయక వేదాదివిద్యల నభ్యసించుచుఁ గులాచారము ననుసరించి మాజనకుల ప్రేమభాజనుఁడ నయ్యెదను. దుర్వ్యసనంబుల జోలికిఁక బోను. నేటికి మాయమ్మ చెప్పిన వాక్యములన్నియు యథార్థములయ్యె" ననుకొని యింటికిఁ జేరెను. తానింటికిఁ జేరుసరికి దీక్షితుఁడు తనకుఁ దిలోదకంబు విడుచుటయుఁ దల్లిని నిలువెడలఁ గొట్టుటయు దీక్షితాయిని యదృశ్యమగుటయుఁ దెలిసినవి. తోడనే నేలంబడి యేడ్చుచు నెత్తి మోదుకొని "యయ్యయో! నన్నిఁక నాదరించు

వారెవరు ? నేనిప్పుడెట కేగెద. నాకడుపు జరుగుటెట్లు ? 'నాయనా' యని పిలచువారు నాకెవరు గలరు ? ధన మున్నదందునా ? యవివేకినై దుష్టులఁగలిసి వానిని వెచ్చించితి. ధనము లేకున్నను విద్య యున్నదందునా ? యదియు సున్నయే కదా? బిచ్చ మెత్తుకొని జీవించెద నందునా? చిన్ననాటినుండియుఁ బరుల కవ్వారిగ ధనంబు నిచ్చు నే నితరుల నెటుల యాచింపఁ గలను ? నే నేమి సేయుదును ? నాగతి ముందేమి కానున్నదో కదా ? ఎటకేగినను భయము లేదు. ఎండకి కిచ్చినను దరుఁగదు. అట్టి విద్యాధనమే నరునకు ధనముగాని చోరాదిబాధలచేఁ గొల్లవోవుధనము మానవులకు ధనము కాఁగలదే ? యహహా ! నే నెట్టి యుత్తమవంశమున జన్మించితిని. మా వంశీయులందఱును యాగాదులను జేసి శాశ్వతయశమును సంపాదింపఁ దూలరాశిని నిప్పుకణము పడినట్లు నేను బుట్టి ధనమునంతయు దుర్వ్యసన పరంపరాక్రాంత హృదయుఁడనై పాడుచేసి కులమునకు హానిఁ జేసితిని. వంశమర్యాద పోయినది. సూర్యుఁ డుదయాద్రిఁ జేరకపూర్వమే లేచి రజత పాత్రయందు దధిఘృత మిశ్రితంబగు నన్నంబును, బలువిధ వ్యంజనంబులను, బెట్టి ప్రియాలాప పూర్వకంబుగ నాచేఁ దినిపించు తల్లి నాకెన్ని జన్మములకైనఁ గల్గునే ? నేనవివేకినై యట్టి తల్లిని గోల్పోయితినిగదా ! నా కడుపెఱిఁగి పెట్టు తల్లులెవరేని యీ లోకమునఁ గలరే ?

తల్లిలేని బిడ్డఁడు దూదిపింజకంటెఁ జులకనకాఁడే? హర హర! నాగతి నెవరు విచారించెదరు? పరమేశ్వరా! నాకింతటిగతి తెచ్చిపెట్టితివా? అహహా! నాయట్టి పాపి యీరేడులోకములనెందైనఁ గలఁడే? దుష్టుఁడనగు నన్నుఁ గనుట చేతనే పతివ్రతా శిరోమణియగు నాతల్లి కంతటి దుస్థితి చేకూరినది. వేదములు 'మాతృదేవోభవ' 'పితృదేవోభవ'అని చాటుచుండ నజ్ఞానుఁడనగు నేను మాతృ హంతకుఁడనైతిని. మఱియు నేమహాప్రాజ్ఞుఁడు సంతతికై యనేక విధంబులఁ దపమాచరించి నన్నుఁగని పున్నామ నరకమును దాఁటితినని సంతసించుచుండెనో? యేమహాత్ముఁడు నిజ కులాచారమును పాలించుచు రాజపూజితుఁడై స్వసుఖము నాసించిక నాకై యమిత ధనంబు నార్జించెనో? యేదీక్షితోత్తముండు నాయభివృద్ధికై నిత్యదానంబుల, యజ్ఞంబుల, బ్రాహ్మణపూజలఁ గావించుచుండెనో? యే యుత్తముఁడు నగరజనుల భక్తి భాజనుఁడయ్యెనో? యే మహామహుఁడు సత్యరతుఁడు, కులీనుఁడు, సదాచారపరుఁడు, దైవభక్తిపరుఁడు అనుబిరుదములసముపార్జించెనో? యట్టి యజ్ఞదత్తునకుఁ గొడుకునై పుట్టి యాతని గౌరవమును, గులాచారమును నీటఁగలిపితిని. కొంతకాలము నా చెయ్వులకు సహించి తుదకు మనసు పట్టఁజాలక స్వకుల ప్రతిష్ఠను నిలుపుకొనుటకై వంశ దూషకుఁడనగు నన్నువీడెను.

ఇఁకె నా తల్లి విషయమై నేఁ గావించిన యపరాధ మింతంతని చెప్ప నలవియగునా? యేజనని యాహారసుఖంబుల మాని నన్నుఁబెంచి పెద్దవానిఁజేసినదో? యేమాత శుచిత్వమును గోల్పోయి హేయమగు పనులంజేసి నన్ను రక్షించినదో? యేతల్లి యెండ కన్నెరుంగకుండఁగను, గడుపు వాడకుండఁగను జేయుచు నన్నుఁ బెంచి పెద్దవానిఁ జేసినదో? యే యువిద నాకై దబ్బరలాడి యసత్యతా దోషమునకుఁ బాలయ్యెనో? యే యింతి నన్ను బ్రేమించి నా కాపదవచ్చునను భయంబున భర్తృవిరహంబునకును, లోకనిందకునుగూడ బాత్రురాలయ్యెనో? యే యమ్మ నా నిమిత్తమునఁ బలువిధంబుల విచారించి తుదకాత్మహత్య గావించుకొనెనో? యట్టి తల్లికి నేను గుమారుఁడనై దోషముఁ గావించినాఁడ. నాకిఁక గతులుండునే? నన్నిట్టి మాతృహత్య జేయ నాపరమేశ్వరుఁడు పుట్టించెఁగాఁబోలు? అయ్యయో? నే నింత దిక్కుమాలిన వాఁడ నగుదునని మున్న యెఱుంగనయితిగా? దైవజ్ఞుఁడగు నాతండ్రి నాజనన కాలమున వీఁడు కులదూషకుండని యెంచి చంపిన బాగుండునే. తన వంశ ప్రతిష్ఠ నిలుచునే. తల్లియైన నప్పుడు పుత్త్రహత్యా దోషమునకు జంకకున్న నీదోషంబులా మెకు నామూలంబున వచ్చియుండక పోవునే యనుచు దీనుఁడై విచారించుచు నంతందాహారమునకుఁ బరిభ్రమించుచుండెను. గుణనిధి యిలు వీడి రెండు దినము లయినది. తిండి

లేదు. పరుల నడుగుటకా నోరు రాదు, కొనుటకా ధనము లేదు. యే మహామహులైనను బిలిచి పెట్టెదరన్నను గొప్ప వంశమునఁబుట్టి కులదూషకుఁడై తండ్రిచే వీడఁబడిన వాఁడౌటఁ బరుల మోములఁ జూడ మోమోటపడుచుండెను. ఇక వీనికెట్లా హారము చేకూరఁగలదు. పాపము! తిండిలేమిఁజేసి శరీరము కృశించినది. లేవసత్తువలేదు. నడవఁ గాళ్లురావు. పరులనడుగుటకు నోరురాకున్నయది. అట్టిస్థితిలో నెటులో విధిచోదితుఁడై సాయంతన మగుపరి కాయూరంగల దేవళముంజేరె.

—♦ గుణనిధిమరణము ♦—

ఆనాఁడు శివరాత్రియగుట నగరమునఁగల సంపన్నులును, నిరుపేదలును, నుపవసించి ఈశ్వరాభిషేకముఁ గావింప మనగుణనిధిచేరినశివాలయమునకువచ్చి యభిషేకముఁ గావించి పోవుచుండిరి. గుణనిధి యాయాలయ సీమ శివునకెదురుగఁ గూర్చొనియుండి తాము తెచ్చిన యుపహారములలో నెవరైనఁ దనకుఁ గొంత యిచ్చెదరేమోయను నాసతోఁ దదేక దృష్టి కలవాఁడై చూచుచుండెను. కాని యొకరైనను గుణనిధిని జూచినవారు లేరైరి. దానంజేసి మఱింత దుఃఖముతో "బరమేశ్వరా! యిటకు వచ్చినవారిలో నొకఁడైనను దానశీలుఁడు గాకపోయెఁగా? నాకొక ఫలమైన నీయరుగా? నాప్రాణము పోవుచున్నదే! యింక నేదేని యాహారము పడినఁగాని నాప్రాణము నిలువదు. నిశీథసమయమయ్యె. వచ్చిన వారందఱును

కూడఁ బోయిరి. మందభాగ్యుఁడనగు నేనీ దేవళమున కేందుకు వచ్చితిని? ఊరఁదిరిగిన నే వితరణవతియైన నన్నుఁజూచి కమితాహారము నీయకుండునా? యీయకపోయినను సిగ్గువిడిచి యడిగినైనఁ దిని ప్రాణము నిలుపుకొందునే యని పరిదేవనముఁ జేయుచుండ నొక భక్తాగ్రేసరుఁడగు వణిక్శిఖామణి యారాత్రి జాగరణముఁ జేసి నాలుగు జాములు నుపహారంబుల శివున కీయంగోరి నియమవ్రతమును బూని యధిక భక్తితోఁ బలువిధ శాకంబులను, ఫలంబులను, శాల్యోదనంబును, బలువిధవంటకంబులను, దధి భాండంబులను, ఘృత పాత్రంబులను, నరిపడునట్లు ద్విజ సత్తములచే మోయించుకొని వచ్చి యందుంచి వేద విద్యా పారంగతులగు బ్రాహ్మణులచే నీశ్వరలింగమున కభిషేకముం జేయించుచుండె.

ఆసన్నివేశమున గుణనిధి శెట్టి తెచ్చిన పదార్థంబులఁ జూచి యించుక ధైర్యముం దెచ్చుకొని "యీ యన్నంబు నాకెట్లు సమకూరునో?" యని చింతించుచు మెల్లఁగఁ బోయి ద్వారదేశంబునఁ గూర్చొనియుండి యభిషేక పూర్తియు నృత్తగీతంబులును, నగు నంతదనుక జాగరణముం జేసి యంతంతఁ బనిజలు నిద్రాపరవశులై యుండ నప్పుడు తనకా యన్నంబు లభించు నుపాయంబు లేమిం జేసి యిదివఱ కెన్నఁడును బరిచితుఁడు కాకపోయినను జౌర్యమున నా యన్నమును దీసికొనఁగోరి యపరిమత్తుఁడై తగుసమయమునకు వేఁచియుం

చెను. అర్ధరాత్రి నందఱును నిద్రాపరవశులైయుండ గుణనిధి మెల్లమెల్లన లేచి యుత్తరీయమును నడుమునకుఁ జుట్టి యన్నము దొరకె నను సంతోషమున లేనిబలమును, ధైర్యమును దెచ్చుకొని తలుపు చప్పుడు కాకుండ నోరువాకిలిచేసి గట్టిగ నడుగిడినఁ జప్పుడగునను భయంబున బొట్టనవ్రేళ్ళతో నడిచి, యొకవేళ నెవరైన లేచిన వారికగపడకుండ నుండుటకై దీపపు గ్రిందికిఁబోయి యటనుండి యపూపంబులను, నన్నటిపండ్లను, దధిపయఃక్షౌద్ర బహుపదార్థములను గలిగియుండిన ధవళకల మాన్నము పళ్లెములయందుండుటను జూచెను. అప్పుడు గర్భ గుడియందుఁగల దీపపుఁగాంతి క్షీణమగుచుండ దానిని మెల్లగ నూది తన కనువగు నన్నంపుఁబళ్లెమును జూచి దాని నూపిరి బిగియఁబట్టి మెల్లన నెత్తుసరికి తత్సమీపమునఁ గల యఖండ దీపము నశించుచుండె. తోడనే యా బ్రాహ్మణుఁడు తనకుఁ బోవ మార్గమగపడమి నశించుచున్న దీపమును హెచ్చించి యందు ఘృతంబునునిచి దశలేకపోవుటచే నిజ వస్త్రాంతమును జింపి వత్తిగఁజేసియుంచి యఖండ దీపమును వృద్ధిఁజేసెను. దీపపుఁ గాంతులు నలుగడల వ్యాపించి తనకు మార్గమును సుగమముగఁ జేయ నన్నమునకు వాచియున్న వాఁడగుట సంభ్రమంబున నందుండిన యన్నపాత్రంబులలో మిక్కుటమగు దానిని జేకొని వచ్చుచుండఁ దన కాయు వా దినముతో సరి పడియుండుటచేతను, దరిద్ర దశ పోయి తనకు మహావైభవము

సంప్రాప్తము కానున్న దగుటచేతను బ్రమాదవశంబున నూపిరి బిగియఁబట్టి వచ్చుచున్న గుణనిధి పాదమందుఁ బరుండి యుండిన యొకని కాలికిఁ దగిలెను. తోడనే వాఁడు లేచి 'దొంగ దొంగ' యనుచు గద్గదస్వరంబునఁ బలుక నందఱును గతాను గతికులై యాక్రోశించుచు బ్రాహ్మణునిఁ దరుమ గుణనిధియుఁ దాఁబట్టిన యోదన భాండమును వీడక యపరిచితుఁడగుటచే భయాక్రాంత స్వాంతుండై పరువిడుచుండెను. అంతఁ దలారులు బాణంబులఁ గైకొని యాదేవ ప్రాంగణముదాటి బ్రాహ్మణుఁడు పోవకుండఁగనే యాతనిని గొట్టిరి. తోడనే యాతని ప్రాణములును. గష్టములును బోయినవి.

## —♦ యమ శివ దూతల సంవాదము. ♦—

అంత యమదూతలు దుష్టుఁడగు గుణనిధిని నరకమునకుఁ గొంపోవఁ బాశాద్యాయుధ హస్తులై యేతెంచిరి. శివదర్శనమునకుఁ గొనిపోవ శివదూతలును విమానముం జేకొని వచ్చిరి. తమ కెదురుగ వచ్చిన శివకింకరులం గాంచి యంతక భటులు "శివకింకరులారా! యీ బ్రాహ్మణుఁడు మాలోకమునకు రాఁదగినవాఁడు గాని మీలోకమునకు రాఁదగిన వాఁడు కాఁడు. ఏలనన వీఁడు చిన్ననాటినుండియు దుస్సహావాసముం జేయుచుండెడివాఁడు. ఆచారహీనుఁడు. కితవుఁడు. వేశ్యాలంపటుఁడు. నాస్తికుఁడు. నిత్యకర్మ కలాపంబులఁ జేయ నొల్లని

వాఁడు మాతృహంతకుఁడు పితృద్రోహి. విశేషించి శివధనాపహర్త. ఇట్టివాఁడు మీ లోకమున కేల్లు రానోపు ? వీఁడేమి సత్ప్రవర్తన పరుఁడా? లేక వీనియందేవేని సుగుణంబులుగలవే? యానతిండు. " అని వేఁడు పరేతరాజకింకరులకు శివదూతలు " కింకరులారా ! మీ మాటలు యథార్థములు. వీఁడు నిజముగ దుష్టుఁడు. అయినను శివధర్మము సూక్ష్మము. శివధర్మ మించుక సిద్ధించినచో నెట్టి పాపములైనను నశించును. భక్తిపరుని ధన్యునిఁ జేయును. స్థూలదృష్టి వీక్షించిన వానికి శివధర్మము దోఁపదు. సూక్ష్మదృష్టిం జూచువారికిఁ దోఁచుచుండు. శివభక్తి మహిమ యగపడినట్లుండియు నగపడదు. దానిం దెలిసికొనుట కష్టతమము. శివధర్మాచారమును గుర్తింప నజుఁడైన నసమర్థుఁడు. అది యెల్లప్పుడును సూక్ష్మాతిసూక్ష్మమైయుండును. కాన మీకుఁ దెలియదు. ఇతఁడు గావించిన సుకృతముల వినుండు. ఈ బ్రాహ్మణోత్తముండు శివరాత్రి దినంబున నన్నంబు దొరకమిచేనైన నుపవసించె. అన్నము నపహరించు మిషనైన వేగుసత్రితకు జాగరణంబు జేసె. అన్న భాండావలోకన వ్యాజంబునైన నశించుచున్న యఖండంబును వృద్ధిఁజేసె. బుద్ధిపూర్వకముగఁ జూడఁ దలంపు లేక పోయినను బరులు హరునిఁ బూజించుచుండఁ జూచెను. ఈశ్వరుని యాలయ సీమను బ్రాణంబుల వీడెను. తలఁచిచూడ నింతకంటె నెక్కుడు ధర్మంబులెవ్వి ? అదియుంగాక యెట్టి

దుష్టుఁడైనను దెలిసియో తెలియకయో మఱి యే కార్యమున కైనను శివరాత్రి రోజున జాగరణముం జేసినను నుపవసించినను దానుజేయక పోయినను బరులుచేసిన పూజను జూచినను వానికిఁదప్పక శివసాయుజ్యము లభించును. కాన వీఁడజ్ఞానమున నెంతటి ఘోరకృత్యములఁ జేసినను విష్ణువు వీఁడు కావించిన ధర్మములు వానిని దొలఁగజేసి ధన్యునిఁజేసినవి. కాన మీరు వీనిని విడిచి పొండు" అని యానతిచ్చి విమానమున నీబ్రాహ్మణునిఁగూర్చుండఁబెట్టి శివలోకంబునకుఁ గొంపోయి శివ సాన్నిధ్యమున నుంచిరి. యమదూతలు శివమాహాత్మ్యమున కచ్చెరు వందుచుఁ బోయి యీవృత్తమును దమతేనికెరుక పఱచిరి. యముఁ డందులకు సంతసించె. నిజకింకరులు దీసికొనివచ్చిన బ్రాహ్మణునిఁజూచియు మాధవుఁడు దయార్ద్రహృదయుఁడై శివరాత్రినాఁడు గర్భ మంటపమునఁగల దీపమును వృద్ధిఁజేయుట మున్నగుఁ బుణ్య కార్యముల కనురూపముగఁ గళింగ దేశాధిపతియైనఁ యరిందమునకుఁ దనయుఁడై దముండనుపేరఁ గళింగ దేశమునకు రాజుగానుండ ననుగ్రహించి పంపవేసి తన యాశ్రితావన తత్పరత్వమును జూపె.

నాలవప్రకరణము సమాప్తము.

---



# గుణనిధి.

## అయిదవప్రకరణము.

### దముని యోగ్యత.

అరిందముఁడను రాజు చిరకాలము సంతతి లేమికిఁ గుంది యీశ్వరానుగ్రహంబున నొకసుతునిం బడసెను. సుతోత్పత్త్యనంతరమున నరిందముఁడు నిజసుతునకు జాతకర్మాదిసంస్కారములను యథావిధిఁ గావించి దముఁడను నామకరణముం జేసి యాతని నతి గారాబమునఁ బెంచుచుండెను. సుతుఁడు దినదినాభివృద్ధినొందుచు శైశవమును దాటి సర్వజనమనోభిరాముఁడై యలరారుచుండెను. అంత రాజు నిజసుతునకు విద్యనభ్యసింపఁ దగిన కాలము సమీపించుటంజేసి యుచితరీతి నాతనిని దగు గురువులకడ కంపుచుండె. దముఁడు పూర్వజన్మ జ్ఞానము నీశ్వరానుగ్రహంబున సంపాదించిన

వాఁడగుటంజేసి యీజన్మంబున సత్సహవాసమును జేయుట కును, గురు జనానుమతి వర్తించుటకును, సకల విద్యా పారంగతుఁడగుటకును, గృతనిశ్చయుఁడై యుండెను. రాజ పుత్త్రుఁడగుట గురువులును వీనిని దగుశ్రద్ధఁజేకొని యుచితరీతి విద్యలయందు శిక్షించుచుండెడివారు. రాకొమరుఁడు తలిదం డ్రులు తన్నతివాత్సల్యమునఁ బెంచుచుండఁ దాను శక్తివంచన లేకుండ విద్యను, గురుభక్తిని, దైవభక్తిని, వినయమును, సద్గుణపరంపరను వృద్ధిఁజేయుచుండెడివాఁడు. ఇట్లుండ నాతనికిఁ బదునాఱవ వత్సరము గడచినది. దముఁడు పూర్వభవంబున నవివేకంబు, కలిమి యేరీతిని దన జీవితకాలమును, బిత్రార్జిత విత్తమును, గుల ప్రతిష్ఠను గోల్పోయెనో? యారీతి నీజన్మం బున వివేకంబు, కలిమి, సకల విద్యలను, సద్గుణ పరంపరను, సత్సహవాసమును, నచిరకాలముననే సంపాదించి ప్రతాప గుణంబునఁ దపనుని, క్షమాగుణంబున వసుంధరను, బుద్ధిబలం బున బృహస్పతిని, విభవంబున నింద్రుని, వితరణంబున శిభి ప్రముఖులను ధిక్కరించుచు దైవభక్తిపరుఁడును, సర్వజనాను రంజకుండును, శత్రుభయంకరుండును, సత్యరతుఁడును, సదా చారపరుఁడును, ఖలశిక్షకుఁడును శిష్టజనరక్షకుఁడునై యుండెను.

## —♦ రాజ్యాభిషేకము. ♦—

అత్తఱిఁ బ్రజలందఱును దముని సుగుణ పరంపరకును, సురూప సంపదకును, బ్రతాప పటిమకును, నెంతయు సంతసించి యాతని యౌవరాజ్య పట్టాభిషేకమునకై చూచుచుండిరి. అంత నొకనాఁడు రాజ్యపాలనాశక్తి తగ్గుటయు, వనగమనేచ్ఛ ప్రబలుటయు, జనులు దముని పాలనంబునకు వేఁచియుండుటయు, సుతుని గుణగణంబులు దిన దినాభివృద్ధి నందుటయుఁ గని యరిందముఁడు కుమారుని యౌవరాజ్యాసనాసీనుం గావింప సమకట్టెను. భార్యయు ననుకూలవతి యౌట నరిందముఁడు నిజాభిప్రాయమును వెళ్ళడింపక పూర్వమే యాతని కనుకూలముగఁ బల్కుచుండె. తోడనే రాజు నిజామాత్య సామంత పౌరజానపదాదుల రావించి "అయ్యలారా! నేజిర కాలమునుండి యీ ధరను బాలించుచున్నాఁడను. నాకోరికలన్నియు నీడేరినవి. రాజ్యపాలనా పటిమయు నంతరించినది. వనగమనేచ్ఛ ప్రబలుచున్నది. నేఁనిక నస్థిరంబులగు నీ సాంసారిక సుఖంబుల వీడి రాజ్యమున నాసుతు దము నభిషిక్తుని జేసి వానప్రస్థాశ్రమంబును జేకొన నభిలషించుచున్నాఁడను. కానఁ దామందఱును నాయుద్యమమున కంగీకరించితిరేని యిప్పుడ పోవువాఁడ. మీరును మోమోటము వీడి మాదముఁడు మిమ్ముఁ బాలింపఁ గలఁడను నమ్మకము కలదేని నాలోపంబుల మన్నించి నాకు సెలవొసంగుఁడు." అని వారల నుద్దేశించి

పఱుక వారును సంతుష్టాంతరంగులై రాజాభిముఖముగ నిలిచి "ఏలినవారు మమ్ముఁ బాలించుటంజేసి యింతదనుక సుఖవంతులమును, ధనవంతులమునై యున్నారము. మీయెడ నేలోపంబులును లేవు. భవత్సూనుఁడు సకలవిధంబుల మిమ్మే పోలియున్నాఁడు. మేమాతని యౌవరాజ్యాభిషేకమునకై వేచియున్నారము. అతఁడు రాజ్యపాలనమున మిమ్ము మఱచునట్లు చేయఁగలాఁడని మా దృఢనమ్మకము. దేవా! మఱియొకటి వినుండు. తా మరణ్యమునకుఁ బోవుదురను విచారము దమకుఁడు మీయనంతరమున రాజై మమ్ము సుఖంబుండునట్లు చేయఁగలాఁడను సంతోషమును మామనంబుల దూగాడుచున్నవి. దానంజేసి మేమిట్లు చేయుమని చెప్ప సాహసింపఁ జాలకున్నారము. విదితప్రజాభిప్రాయులగుఁ దామే యేది యుత్తమమని మీమదికిఁ దోఁచిన నట్లుచేయుఁడు" అనుచు నేకగ్రీవముగఁ బలికి యందఱు నుచితాసనాసీనులైయుండిరి. తోడనే రాజు కొలువుసాలించి సుబుద్ధి, సత్యగుప్తులను బ్రధానుల రావించి "కుమారున కభిషేకముఁ జేయవలయు. దానికి వలయు సంభారములను భద్రపఱుప వేగకుల సత్వరమ పంపుఁడు. మఱియుఁ బట్టణమంతయు నలంకరింపఁ జాటం బంపుఁడు. సుహృద్బాంధవులను, సామంతరాజులను, ద్విజసత్తములను, నభిషేకమును జూడ రాఁబిలువఁ దగు భటులఁ బంపుఁడు. ఇంకను నభిషేక దిదృక్షువులై యేతెంచిన జను

లకుఁ దగుశిక్షంబున సదుపాయంబులఁ జేయుటకుఁ గొందఱ నియమించి యీయభిషేకదినంబుల జనులకు వలయు వస్తువుల నుచితంబుగ నిచ్చునటుల నాపణంబునఁ గట్టడచేయింపుఁ" డని చెప్పి దైవజ్ఞుల రావించి ముహూర్త నిశ్చయముఁ గావించె. ఈ వార్త యంతటను వ్యాపించుటంజేసి జనులందఱు నమితోత్సాహులై తమ తమ యిండ్ల నలంకరించుకొని యభిషేక దినంబునకై యెదురు సూచుచుండిరి. మహారాణియు సంతుష్టాంతరంగయై యంతరాయములు గలుగకుండుటకుఁ బుణ్యవ్రతంబుల, దానధర్మంబుల నధికముగఁ జేయించుచుండె. మంత్రులు రేనియాజ్ఞను శిరసావహించి సర్వము సిద్ధముఁ జేసిరి. అంత నభిషేక ముహూర్త మాసన్నమగుడు రాజపురోహితులు రాజును రావించి యథోచితంబుగ దమునిసామ్రాజ్య సింహాసనాసీనుఁ గావించిరి. తోడనే విప్రాశీర్వాదరవంబులును, సాధువాదంబులును, నృత్తగీతవాద్యంబులును జెలరేగి మిన్ను ముట్టినవి. అభిషేకానంతరమున నరిందముఁడు ద్విజసత్తములకు దక్షిణలను, సామంతాదులకుఁ దగు బహుమతులను, నొసంగి సర్వజనులకు సంతోషంబులును లేకుండఁగావించి వారి వారి భవనంబుల కనిపె.

—♦ అరిందముఁడు కానకుఁ బోవుట ♦—

అభిషేక పూర్తియగుడు రాజు భార్యాసహితుఁడై కానకుఁబోవనెంచి కుమారుం బిలిచి "నాయనా! దమా!

నేనీరాజ్యమును జిరకాలము బాలించితిని. నీవును నావలెఁ బ్రజల నప్రమత్తుఁడవై పాలింపుము. మన వంశీయులకు శాశ్వతయశమేయుత్కృష్టధనముకాన దానినే నీవు సంపాదింప వలయును గాని దుర్వ్యయంబులకు వలయు ధన సంపాదనకై యత్నింపఁ గూడదు సుమా! ప్రజలఁ గన్నబిడ్డలవలెఁ జూచి పాలించు రాజు తన రాజ్యమును దక్కించుకొనఁగలఁడు. లేనిచో దుఃఖ భాజనుండై యచిరకాలములోనే పదభ్రష్టుఁ డగును. కాన నీవీ యర్థంబు గుర్తించి సుఖంబుండుము. సర్వ విధంబుల నాకంటె నుత్కృష్టుఁడవగు నీకు నేనింత నెక్కుడుగ నుపదేశింప వలసిన దేద్దియు లేదు. కాన నేఁగానకుఁ బోవు చున్నాఁడ" నని చెప్పి యాతనిని వీడి సుబుద్ధి సత్యగుప్తులను మంత్రులను బిలిచి "సచివోత్తములారా! యీ వఱకు మీరు నన్నును, నారాజ్యమును గంటికి ఱెప్పవోలె రక్షించిరి. ఇఁక మా దముని రక్షించు భారము. మీయది సుఁడీ! మీయను మతి మా దముఁడు వర్తింపఁగలఁడు. నాకింక సెలవిండు. పోయెద" నని చెప్పి పౌరజాన పదుల నుద్దేశించి "జనులారా! మీయనుమతిని దము నభిషిక్తునిఁ జేసి నే వనంబున కిప్పుడ యేగుచున్నాఁడ. దముఁడు సదయుఁడై మిమ్మందఱిని గన్న బిడ్డలవలె నెంచి పాలించుచుండును. మీకు సర్వసుఖంబులును గలుగఁ గలవు. మీరును మాదముని నన్నుఁబోలెఁ జూచుచు రాజభక్తి ధౌరేయులును, సత్యరతులును, ధర్మనిరతులును,

న్యాయపరులును, నాయురారోగ్యైశ్వర్య వంతులునునై యుం డుఁడు". అని చెప్పి వారిని వీడెను. ఇంకనుదృష్టిఁ జెందక సామంతుల నుద్దేశించి "సామంతులారా! మీరు మాదముని సోదరునిగ నెంచి యవసరంబగుడ నాకారితులయ్యు వానికిఁ దోడ్పడు చుండుఁ"డని యా యాయిజనులకుఁ జెప్పవలసిన హితవులఁ జెప్పి యందఱి యనుమతిఁ దాను గానంజేరి వానప్రస్థుఁడై పారలౌకిక సుఖ సంపాదనేచ్ఛాపరుఁడై యుమాధవునిగూర్చి తదేక నిష్ఠాగరిష్ఠతఁ దపంబాచరించుచుండె.

## —♦ దముని రాజ్యపాలనము ♦—

దముఁడు తండ్రి కానకుఁబోవుటకు విచారించియు ధీరో దాత్తుఁడగుటచే నా దుఃఖమును మఱచి రాజ్యపాలనముఁ జేయుచుండె. దముఁడు పూర్వభవంబున రామశర్మాదుల స్నేహమ్మున నవివేకంబు కలిమిఁ జెడిన విధంబున నీజన్మంబున సుబుద్ధి సత్యగుప్తులను మంత్రుల స్నేహంబున వివేకంబు కలిమి ధర్మపక్షావలంబియై న్యాయ్యమ్ముగఁ బ్రజలను గన్నబిడ్డల వలెఁ జూచి పాలించుచుండెడివాఁడు. అతఁడు సుబుద్ధి, సత్య బుద్ధుల రావించి మీరీ దినము మొదలెన్నఁడేనిఁ గితవులను, విటులను, నాస్తికులను, గులదూషకులను, జారులను, బర ధనాభిలాషులను జూచితిరేని తక్షణము నా యొద్దకు గొని రండు. లేదేని వారికి నయమునను, భయమునను, బుద్ధిఁ జెప్పి యా యుద్యమమునుండి తప్పించుఁడు. అదియునుగాక సచి

వోత్తములారా! నేఁడు మొదలు ప్రతి గృహమునందును, శివాలయములందును, దేశములయందెల్లయెడల దీపకళికల ననవరత ముండునటుల, చంద్రమౌళి పూజ సేయునట్లును, జాటం బంపుఁడు. అటుల నాయాజ్ఞ నుల్లంఘించి యింటింట దీపకళిక లుంచని వారిని నాకుఁ జెప్పుఁడు. నేఁ బోయి వారల కుపదేశించెద. మఱియు జను లందఱును, దమ వ్యాపారముల ముగించుకొనిన తరువాత శైవ భాషణంబుల వినునట్లును, బూజలఁ జేయునట్లును జేయుఁడు. ఏపనియుఁ జేయక మాత్ర గర్భమును జెరుపఁ బుట్టిన వారిని నా యొద్దకు గొని రండు. మీరును మీ మీ కార్యములయందప్రమత్తులై యుండి రాజ్యభారమును వహించుచు నఖండదీపంబుల మీ యిండ్ల నునిచి చంద్రశేఖరారాధనపరులై శివుని కథలను వినుచుండుఁడు. పొండు." అని యానతిచ్చి తానును గొలువు చాలించె.

## —♦ దముని దినచర్య ♦—

దముఁడు రాజనీతివిదులును, కృతజ్ఞులును, రాజ్యపాలనా పటిష్ఠులును నగు సుబుద్ధి, సత్యగుప్తులను మంత్రులకు రాజ్యము నప్పగించి తాను శివభక్తితత్పరుఁడై దేశంబుల శివాలయంబులఁ బ్రతిష్ఠించుచు వానియందఖండదీపంబులఁ బెట్టునటుల నాజ్ఞాపించుచు నప్పుడప్పుడు తాను దేశీయు లందఱును తన యాజ్ఞానువర్తులై యున్నారో, లేదో పరీ

క్షీణింపఁ బ్రచ్ఛన్నవేషంబునఁ జనుచుండు. ఇంకను స్వసుఖంబుల నాసింపక సర్వభూతములయందును సమహితత్వంబునఁ బరగుచుఁ బ్రజల నప్పుడప్పుడు రావించి వారలకు శివ ధర్మముల నుపదేశించుచు వారందఱును, బరమభక్తులగు నటులఁ గావించుచుండెడివాఁడు. ఆతఁడు శైవుఁడు విచ్చేసి రనిన నెదురుగఁ బోయి వారి పాదంబుల కెఱఁగి యథావిధి వారిని సత్కరించి వారి వలన శివధర్మముల వినుచుండెడి వాఁడు. శివపూజ యన్న నొడ లెఱుంగఁడు. కులహీనుఁడై నను శివునిఁ బూజించుచుండెనేని వాని నధికముగ గౌర వించుచుండెడివాఁడు. తాను నిద్రించుచుండినను శైవభాష ణములనే పలవించుచుండును. పరులతో రాజకీయములను ముచ్చటించునప్పుడైనను శివమాహాత్మ్యమునే చెప్పుచుండెడి వాఁడు. తన దేశమునందంతటను, గణనాతీత శివాలయంబుల స్థాపింపఁ జేసెను. ప్రజలు తన యాజ్ఞను బాలించుచుండుట కెంతయు సంతసించుచుండెను. దేశమునందంతటను శివా లయములే! యే యింటఁ జూచినను శివపూజలే! యేవీధిఁ జూచిన నఖండదీపంబులే! యెటఁజూచినను శైవపురాణములే! యే వైపు చూచినను విభూతి రుద్రాక్ష మాలికా ధారులగు శైవులే యక్షిగతు లగుచుండిరి.

## —♦ దముని మరణము ♦—

అటుల దముఁడు శివానాథుని సఖ్యమును గోరుచు దినంబులఁ గడుపుచుండెను. ఇట్లుండ దమునకు దుశ్శకునములు పొడసూపఁ దొడంగె. తోడనే దముఁడు తనకు మరణ

మాసన్నమైనదని సర్వజ్ఞుఁ డగుటఁ జేసి తెలిసికొని సుబుద్ధి, సత్యగుప్తుల రావించి "మంత్రులారా! నా శరీరమున నొక విధమగు రోగము ప్రవేశించినది. నే నింక జీవింతు నను నాసయు లేదు. ఈ రోగము కుదురునదియుఁ గాదు. కాన నేను మీ కీ రాజ్యము నొసంగెద. మీరును దీని కొఁ గా దనక రాజ్యమును జేకొనుఁడు. నే నిఁక మీతో మాటాడ సమర్థుఁడను గాను. కాలము సమీపించుచున్నది." అని చెప్పి వేవేగ నుదకంబులఁ దెప్పించి బ్రాహ్మణోత్తములగు సుబుద్ధి, సత్యగుప్తులకు రాజ్యమును ధారాపూర్వకంబుగఁ బరమేశ్వ రార్పణమ్మనుచు నిచ్చివేసి తాను బ్రాయోపవిష్టుండయ్యె. సచివులు దముఁ డట్లుగావించుటకు మనంబుల ఘనంబగు దుఃఖమును జెంది యేమియు నననేరక యూరకుండి రాజునకు జరమకాలమున సేవఁ జేయుచుండిరి. అట్లుండ నొక కొంత సేపునకు దముని భక్తి విశ్వాసంబులకు మనంబున సంతసించి యుమాసహితుఁడై చంద్రచూడుఁ డేతెంచి నిజస్వరూపంబున నాతని మ్రోల నిలిచి "వత్సా! నీ భక్తికి మెచ్చినాఁడను. నీ యభీప్సితంబును నే నెఱుంగుదును. నేఁడు మొదలు నీవు నాకు మిత్రుఁడవై యుండుము. నీవు భావిజన్మంబున ననుదిన దీపికా దాన ఫలంబునఁ జేసి బ్రహ్మకులంబున జన్మించి యక్ష లోకాధిపతివి కాఁగలవు." అని యానతిచ్చి నిజవిమానమునఁ గూర్చుండఁ జేసి తీసికొనిపోయెను.

## —♦ పురజనుల విలాపము ♦—

సుబుద్ధి, సత్యగుప్తులు దముఁడు మరణించిన తోడనే తండ్రిపోయిన బిడ్డలవలెఁ గన్నీటిధారలేరులై పార నేడ్చుచు నెట్టకేలకు ధైర్యముఁ దెచ్చుకొని యాతనికిఁ బారలౌకిక క్రియాకలాపంబుల విధివిధానంబున జరిపిరి. రాజ మరణవార్త యూరంతటను వ్యాపింపఁ బురజను లందఱును బుత్రులఁగోల్పోయిన తండ్రులవలెను, నాలిఁగోల్పోయిన భర్తలవలెను. గోలు గోలుమని యేడ్చుచు వ్యాపారాంతరశూన్యులై యుండిరి. పురంధ్రీలలామలును "అయ్యయో! మనలఁగన్న బిడ్డలవలె నెంచు దమ మహారాజు స్వర్గపురి కేగెనే! మనలనిఁక దయాపూర్వకముగఁ బాలించు రాజరత్నమెవఁ డౌదవునో కదా? చల్లని ప్రభువమ్మా! యింతటిలోనే యాపాపపు విధి యీతనికి మరణమును గల్పించెనే! ఇంక నీతఁడు మనలఁ జిరకాలము పాలించుననుచు మనంబుల సంతసించుచుండ నాపాపపు మృత్యుదేవత యెక్కడ వచ్చెనమ్మా? యెంతటి పుణ్యశాలుర కైనను మరణము తప్పదు కదా? శివభక్తుఁడగు నీతనికిఁ గూడ మరణము సంభవించినదే? ఇఁక మనఁబోటి యమ్మలకు మరణము సమకూరుననుటలో సందేహమున్నదే?" యనుచుఁ బలుపరి విధంబుల విలపించుచుండిరి. అట దముఁడు శివుని సఖ్యమును జేకొని పులస్త్య బ్రహ్మకు సుతుఁడగు విశ్రవోబ్రహ్మకు పుత్రుఁడై యుద్భవించె.

అయిదవ ప్రకరణము సమాప్తము.

---



# గుణనిధి.

## ఆఱవ ప్రకరణము.

### — గుణనిధి ధనేశ్వరుఁడగుట —

యాజ్ఞదత్తి విశ్రవోబ్రహ్మకు సుతుఁడై యుద్భవించి జనకుల యాజ్ఞ గైకొని వంశాచార పరాయణుఁడై కానలఁ దపమాచరించుచుండె. తపః పరిపూర్తియగుడు వైశ్రవణుఁడు నిజభవనమునకు రా విశ్రవోబ్రహ్మ సుతుని గుణ పరంపరకెద నానందించి యాతనికిఁ బరిణయముం జేసె. పరిణయమైన పిమ్మట యాజ్ఞదత్తి తలిదండ్రులం గూడి యొక కొన్నినాళ్లు గడపి పితృాజ్ఞానుసారమున లంకాపట్టణమునకు రాజయి దానిని బాలించుచుండె. అట్లుండ మరికొన్ని నాళ్ళకు విశ్రవోబ్రహ్మ కైకసి యను రాక్షసకన్యను వివాహమాడి యామెయందు రావణ కుంభకర్ణ విభీషణు లను ముగ్వుర సుతులం గనెను.

అందు జ్యేష్ఠుఁడగు రావణుఁడు బ్రహ్మ వలన వరంబులఁ గైకొని లోకకంటక బిరుదాంకుఁడై తనకు జ్యేష్ఠుఁడగు వైశ్రవణుని లంకనుండి నిర్వాసితుం గావించి యద్దానిని దా నాక్రమించెను. యాజ్ఞదత్తి గుణనిధి యనునట నేమియుఁ జేయఁజాలక తండ్రి యాజ్ఞ నలకయను పత్తనమునఁ జేరి యీశ్వర సఖుఁడై దానిని బాలించుచుండెను. ఈశ్వర సఖుడయ్యును, నిగర్వియై తన పూర్వపు జన్మవృత్తముల నీశ్వరానుగ్రహమున గుర్తించినవాఁడౌట నేమరక యీశ్వరారాధనఁ గావించుచు పత్తనమునం దీశ్వరాలయ ప్రతిష్ఠలఁ జేయుచుఁ దన ప్రజలందరును, శివభక్తులగునటులఁ గట్టడ చేసి ధనేశ్వర బిరుదమును సముపార్జించెను.

## ధనేశ్వరుఁడు కాశికిఁ బోవుట

విదిత యీశ్వర ప్రభావుఁడగు గుణనిధి యింకను శివునిఁ బ్రార్థించి దివ్య దృష్టిని వేఁడు కోరిక నా యుమాధవుని పట్టణం బగు కాశిం జేరె. పంచక్రోశ పరిమితి గల యప్పట్టణంబున భక్తవత్సలురాలగు నన్నపూర్ణమ్మ తమ్ము దర్శింప వచ్చిన భక్తులకుఁ గొఱంత లేకుండ భోజన మిడు నొక సత్రశాలం గట్టించె. మఱియుఁ బార్వతీ పరమేశ్వరుల యాజ్ఞానుసారమున నా పట్టణంపుఁ బూఁబోండ్లనవరతము నతిథిపూజా దురంధరులై యుండి శివు నారాధించుచుండెడి వారు. సర్వజ్ఞుని పట్టణం బౌట నందు జేరిన వారందఱును

విద్యావంతులును, ముముక్షువులునై యుండిరి. మఱియు నా పట్టణంబునఁ జచ్చిన జంతువులకు ముక్తి గలుగుచుండెడిది. దానంజేసియే "కాశ్యాన్మరణాన్ముక్తిః" అని చెప్పుచున్నారు. ఇది కారణంబుగ జనులందఱును గాశీవాసమును, నందు మరణమును, శ్రీ విశ్వేశ్వరుని సందర్శన సుఖమును గోరుచున్నారు. అట మరణించినవారికే కాక యితర దేశములఁ జచ్చినవారికైనను గాశీయందుఁ బిండప్రదానమును జేసిన ముక్తులగుదురని చెప్పుట యతిశయోక్తి కాదు. ఒకమాఱు గంగయందు స్నానమాడి యీశ్వర సందర్శన సుఖము ననుభవించి యటఁ జచ్చినమాత్రాన ముక్తి కలుగుచుండ ననవరత మటనే యుండి యీశ్వర సేవం జేయుచు నా పట్టణంబున నేకంబులగు శివలింగంబులఁ బ్రతిష్ఠించిన నెంత పుణ్యము కలుగునో? యను నాస ననేకులు మహామహులా పట్టణముం జేరి గంగాస్నానము జేయుచు ముక్తిమంటపమున నీశ్వర ధ్యానమును గావించి యీశ్వర సందర్శనముం జేసి యందు శివలింగ ప్రతిష్ఠాపనముంజేసి యీశ్వరసాయుజ్య సామ్రాజ్య సుఖముల నందుచున్నారు. కాశిం జేరి యాజ్ఞదత్తి యరుణోదయ కాలమునకు గంగయందు స్నానముఁజేసి శ్రీవిశ్వేశ్వరుని సందర్శించి యారాధించుచు శివభక్తులం గలిసి యనవరతము శివధర్మంబులఁ దెలుసుకొనుచు దినంబులు గడపుచుఁ గాశిం బ్రజలు సేయు పనులను గన్నులారం గాంచిన వాఁడౌటం దాను నట్లు కావించి యట నీశ్వర ప్రత్యక్ష మగునంతదనుక దపం బాచరింప సమకట్టెను.

## శివలింగ స్థాపనము.

యాజ్ఞదత్తి యీశ్వరానుగ్రహంబున దివ్య దృష్టిని బడయ నెంచి పట్టణంబంతయు నొకసారి చూడ సమకట్టెను. అందునఁ బట్టణంపు వీథులఁబోవుచుండ నింటింట నఖండదీపంబు లుంచు వారును, శివకీర్తనంబుల వినువారును, శివునిఁ గీర్తించు వారును, బూజించు వారును, శివలింగ స్థాపనంబులకై ముహూర్తంబుల నిశ్చయించువారును, మేలముల యందైన నీశ్వరునే ధ్యానించువారును నై జనులుండిరి. అంతటను జనులు శివ సాయుజ్యమును గోరి యున్నవారగుటఁ దనకుఁగల కోరిక ద్విగుణీకృతమయ్యె. తోడనే వైశ్రవణుఁడు పట్టణమునఁ దా స్థాపింపఁబోవు లింగమునకుఁ దగు తావును వెదకఁగోరి గంగాతీరంబునఁ దిరుగుచు ముక్తి మంటపమునకు వచ్చి తత్సమీపంబునఁగల యొక నిర్మల ప్రదేశంబున భక్తిపూర్ణ మనస్కుండై యొక యీశ్వర లింగమును బ్రతిష్ఠించెను. లింగ స్థాపనముఁ గావించినను నిజ మనోరథ మీడేరమి యాజ్ఞదత్తి యా యీశ్వరలింగమున కెదురుగఁ గూర్చొనియుండి తన మనంబున నీశ్వర సాన్నిధ్యమును గల్పించుకొని నిర్నిమేషంబుగ నాతని నీక్షించుచు వేయేండ్లు ముల్లోకంబులు మెచ్చునటులఁ దపం బాచరించుచుండె. అప్పటికిని త్రిలోచనుఁడు తనకుఁ గానరామి నత్యంత ధైర్యంబునఁ గామాది విరోధుల జయించి నిరాహారుఁడును, ఫాలన్యస్తాంజలియుఁ, దదేక నిష్ఠాగరిష్ఠుండునునై

పద్మాసనంబునఁ గూర్చొనియుండి తపముఁ గావించుచుండె. చిరకాలమునుండి నిజ మిత్రుఁడగు వైశ్రవణుఁడు తన దర్శనమును గోరి కాశిం బరిభ్రమించుటయు నిరాహారుఁడై తపంబాచరించుటయుఁ దన్నుఁ ద్వరసేయ నుమాకాంతుఁడు నిజదర్శనము నాతని కీయనెంచె.

## ఈశ్వర ప్రత్యక్షము.

నిజభక్తునకు దర్శన మీయఁ గాత్యాయినీవల్లభుండు భోగి భోగంబులును, నెమ్మలదండయు, వ్యాఘ్ర చర్మమును విభూతి పూఁతయును, భిక్షా పాత్రంబును, ఫాల నేత్రంబును బ్రకాశించుచుండ నిజార్ధ శరీరమును గిరిజకును, శిరమును గంగా శశికళలకును నొసంగి యాజ్ఞదత్తి యెదుట నిలువంబడి "సఖా! గుణనిధీ! నీతపంబున కెంతయు మనంబున సంతసించితి. వరంబేదేని వలసినఁ గోరుము" అని యడుగ నయ్యాజ్ఞదత్తి పులకితదేహుఁడై కాఠఛాందోగ్యాద్యుపనిషత్తులను, బంచబ్రహ్మ పంచాక్షరీత్యాది మంత్రంబులను నారాధించి యంజలిపుటంబు లలాటంబునఁ గీలించి "దేవదేవా! త్రిపురాసుర సంహారీ! కాత్యాయినీ వల్లభా! త్రిజగద్రక్షకా! శరణు శరణు. ఈశ్వరా! నీవు నన్ను వరంబు వేఁడుమని చెప్పితివి. అడవులని రాహారులును, బర్ణభక్షకులును, వాయుభక్షకులును నై తపంబాచరించుచుండు యోగివరులకైన దుర్లభంబగు నీదివ్య రూపముంజూపితివి. ఇంతకెక్కుడు వరము నాకొండుగలదే. నీ

యీపట్టణంబున ననేకులు భవద్దర్శన లాలసులై యేతెంచి నిజ మనోరథము లీడేరమి వగలం బొగులుచున్నారు. మఱియుఁ జిరకాలమునుండియు నిన్నేదిక్కుగ నెంచి యనవరతము నీ పూజలఁ గావించుచు మహామహుల మనుచు గర్వించు ఋషి జనులమాని నాకై శ్రమపడి వచ్చితివి. నాకోరికయు నీడేరినది. నిన్నుఁ జిరకాలమునుండి చూడమిచే నా కన్నులు వాచి యున్నవి. మనమన్ననో యనవరతము నిన్నే కోరుచున్నది. నిన్నును నీ పత్తనంబును జూడఁగోరి యిటకువచ్చి చిరకాలము నుండి యున్నాఁడను. నీపత్తన దర్శనమైనను నీదర్శనము కామిచే నిట భవల్లింగ స్థాపనముం జేసి నిజరూప దర్శనాకాంక్షినై యున్నవాఁడ. నేటికి నీ దివ్యరూపముం గనఁగల్గితిని. సుఖంబును జెందినాఁడ. నాకొక కోరికయు లేదు. దేవా! నారక్షణభారమే పూనియున్న నిన్ను వరము వేఁడునంతటి యవివేకినే? వరంబులు వేఁడ నాకొక కొఱంత యున్నదే? పూర్వభవంబున నిన్నిసుమంతయేని దలఁపక నిన్నుఁ దలంచు వారిని నిందించుచు ననవరతము నాస్తికమతావలంబినై సర్వముంగోలుపోయి యొక్క శివరాత్రి దినంబున నన్నము లేమిచే నుపవసించి యోదనము నపహరింప జాగరణముఁ జేసి బలవంతముగ నీయాలయసీమఁ జచ్చినంత మాత్రమున నీవు నాయందుఁ గరుణ వహించి నరకమునకుఁ గొంపోవ వచ్చిన యమదూతలఁ జేరనీక నీలోకమునకు నన్నుఁ గొనిరా నీ దూతలఁ

బంపితివి దీనిని నేమఱచితినే? వేయేల? శివా! యెన్నియో జన్మలనుండి నన్ను నీ దర్శన సుఖమును గలుగఁజేసి రక్షించుచున్నావు. ఇన్నిఁక నేనేమియుఁ గోరఁజాల. నీకు వరమీఁ దలంపు గలదేని మీ శ్రీపాదపద్మములు దర్శించునట్టి సామర్థ్యమును దయసేయుము. ఇదియ నాకోరువరము" అని యూరకుండె. శివానాథుఁ డాతని భక్తికి మెచ్చి స్నేహము నొసంగిన వాఁడౌట నిప్పుడుగూడ నాతని యీప్సితమును నెరవేర్పఁ దలంచి యాతనికి దివ్యదృష్టి యొసంగె. యాజ్ఞదత్తియు నంతతోఁ గృతార్థుఁడై యుండె.

## —♦ గుణనిధిపైన గజ కోపించుట. ♦—

అంతఁ బదునాఱు వత్సరముల ప్రాయమును, నాకర్ణాంతాయత నేత్రంబులును, సుకుమార దేహంబును, గుండలకటకాంగదాది బహురత్న భూషణంబులును, ముత్తియంపుఁ బేరులును, నిర్మల హేమరత్న కర్ణికలును, గంకణమేఖలా ధ్వానులును, నూపుర రవంబులును, నవ్యవయోవిలాసంబును, బ్రకాశింప శైలరాజ తనయ శివుడాయుం జేరి శిరీషకుసుమ మాలా సుకుమారంబగు భుజంబును, ఫణిభూషణ భూషితంబైన ఫాలలోచను భుజం బొరయు నట్లుగా నిలిచిన నీశ్వరదత్తవలగర్వితుఁడగు నైశ్రవణుండు తన మనంబున జగత్సౌభాగ్యమునకు జన్మభూమియగు నీచంద్రానన యెవతెయో కదా? యీజలజాక్షి నాకంటె నధిక తపంబు నెట్లు చేసెనో కదా? ఈమూ నాఁథుడు

ననువలెఁగాక యీబింబాధర నధికముగ మన్నించి నాఁడు గదా? లేనిచో నీయింతి యితని డాసి నిలువఁగలదే? యీ కీరవాణి భాగ్య మెంతదియోకదా? యీశ్వర కృపను గలిగిది" యనుకొనుచుఁ దనమనంబునఁ గల యసూయాగ్ని జ్వలించుచుండ నీరసంబున సవతిని జూచుఁ బ్రౌఢాంగన మాడ్కి నామెను గాంచుచుండెను. అప్పుడేయింతి ప్రాపులేక కృతాంతభంజనుఁడు కృత్యములఁ గావింపఁ జాలఁడో? యేత న్విచంద్రుని చంద్రికమాడ్కి మన్మథ విరోధిని వీడఁజాలదో? యే యువిద సకలజగములఁ జంద్రశేఖరున కిచ్ఛాక్రియాజ్ఞాన శక్తియై లోకంబులఁ గల్పించెనో? యే యండజయాన నిజ తపస్సామర్థ్యమున హరశరీరార్థ భాగంబును జేకొనియెనో? యేపూఁబోడి మహిత హృల్లేఖికా మహా మంత్రమునకు ముఖ్యాధి దేవతయైనదో? సకలజగ దధిష్ఠాన దేవతయగు నాపర్వతరాజతనయ తన్నసూయాపరవశుఁడై తదేక దృష్టి నీక్షించు గుణనిధిని గని మనంబునఁ గినుకఁజెంది నిజ ప్రాణ నాయకుని సమీపించి యాతని మనంబలరునట్లు మృదుమధుర స్వరంబునఁ "బ్రాణేశ్వరా! యీ దురాత్ముఁడు నీకెటనుండి వచ్చినాఁడు? నన్నసూయా పరవశుఁడై మాటి మాటికిని జూచుచున్నాఁడు. మఱియుఁ బలువిధవికారంబులఁ జూపుచున్నాఁడు.

ఇంకను రహస్యంబున ననృతంబులాడుచున్నాఁడు. వీఁడిట్టి యవలక్షణములను గలిగియుంట నీదయ పెంపుననే సుమా! యిట్టి యవలక్షణమ్ములఁ గలిగి పరసహనము లేని వీఁడు నీకు భక్తుఁడయ్యెనే? నీపాపిపునఁ జేసియేకదా? నీ యర్ధాంగ లక్ష్మియగు నన్నుఁ గన్నెత్తి చూడ సాహసించి నాఁడు. చూచుటయే కాక నా సురూపసంపద కెద నిర్నిమిత్తం బుగ నపహ్యాపడుచున్నాఁడు. ఇది నీకు సమ్మతమైనను నాకు మాత్రము గాదుసుమా? నీధర్మపత్నినగు నన్ను విలక్షణముగఁ జూచు బరపురుషుని నీవు మన్నించుటయే గాక మీఁదిమిక్కిలి వానిని దలపై నెక్కించుకొని మురిసియుచున్నావు. నీయట్టి భర్తలఁ జేకొనిన వారుగాఁ బుణ్యవతులు. పతివ్రతనగుట నీకు గోపము వచ్చునేమోయని భయపడుచున్నానే కాని నే దలచిన వీఁడు భస్మీభూతుఁడు కాకుండునే? నీవిక నుపేక్షిపక వీఁడు నన్నిటుల నసూయతోఁ జూడఁ గారణమూరసినఁ గాని నే నూరకొనుదానఁగాను. నీవు కారణ మూరయనిచో నేనిప్పుడ వీనిని దగు విధంబున శిక్షించి నాకోపాగ్నిని జల్లార్చుదాన. ఇంత కెక్కుడుగ నేఁజెప్ప సాహసింపఁజాల. పిమ్మటనీచిత్తము." అని చెప్పి యూరకుండెను.

—♦ ఈశ్వరుఁ డుమ నోదార్చుట. ♦—

వైశ్రవణుండు తన్నుఁ జూచుటకుఁ గోపించి వానిని శిక్షింపఁ బట్టుపట్టి యుండిన గిరిజ నుద్దేశించి భక్తవత్సలుఁడగు

శివానాథుఁడు "శైలతనయా! నీవీ గుణనిధిపై నేల యలుగ వలయు? వీఁడు నాభక్తుఁడు. తర తరముల నుండి భక్తుఁడై నన్నే తండ్రిగను, దల్లిగను, సోదరునిగను, బంధువుగను, మిత్రుని గను, జూచుకొనుచున్నాఁడు. నేనును వీనిని బుత్రస్నేహమునఁ జూచుచున్నాను. కాన వీఁడు నీకును బుత్రతుల్యుఁడనఁ జెల్లును. మన కుమారు నెటులఁ జూచుచున్నావో యారీతి భక్తాగ్రేసరుఁ డగు నీ గుణనిధిని నీవు చూడవలయు. నాభక్తుఁడు నీకు మాత్రము భక్తుఁడుగాఁడా? భక్తుని బుత్ర వాత్సల్యమునఁ జూడఁదగదా? లోకమునఁ బుత్రు లెట్టి యకార్యములఁ జేసి నను, దల్లులు క్షమించి యూరకుందురు కాని వారిని శిక్షించు టకుఁగాని వీధిఁబెట్టుటకుఁగాని యెంచరు. పుత్త్రులు చేయు దుష్కార్యములను దల్లులు క్షమింతురనుటకు మన యీయాజ్ఞ దత్తయే తార్కాణము. కావున నీవు పుత్రతుల్యుఁడగు వీనిని క్షమింపుము. వీఁడు పలుసారులు నన్నుఁజూచిన వాఁడౌట నింత దనుక మనపట్టణంబున మాతవగు నిన్నుఁజూచుటకై యీరీతి దపం బాచరించుచున్నాఁడు. లోకంబునఁ బిల్లలను దల్లులు తండ్రులకంటె నధికంబుగఁ బ్రేమించుచుండుట స్వభావమే కదా? పిల్లలను దల్లులుఁ జూచుటకే యనవరతము యత్నింతురు. అందుచే నీతఁడు నీదర్శన సుఖమునుగోరి చిరకాలము

నుండి యీపీఠం దపం బాచరించుచున్నాఁడు. కాన నీవాతనిని వాత్సల్యమునఁ జూడఁదగదే? ఏయువిదలైన నీయటుల గారి న్యమువహించి పిల్లలుచేయు దుండగముల కలుగుదురే? గోష్ఠ రాంధ్రుగూడ నితరుల పిల్లలు చేయు దుండగములకు సహించి వారిని మన్నింతురే కాని నీయటుల భక్తి విశేషంబునఁ జూచు పిల్లలను శిక్షింప సమకట్టుదురా? విశేషించి యీతఁడు భక్త వత్సలుఁడు. వీఁడు తన మనంబున భక్తిగుణంబునను, సురూప సంపదయందును, దనకంటె నధికులు లేరని గర్వించుచున్న వాఁడౌట నిన్నుఁజూచిన యంతటనే నిజగర్వపరిహారము కా నన్నివిధంబులఁ దనకంటె నుత్తము లున్నారనియు, వారెట్లు సర్వవిధంబుల నధికులైనారో యటులఁ దానును గావలయు నను నీర్ష్యచే నిన్నుఁ జూచుచున్నాఁడు గాని వేఱు దురభి ప్రాయముతోఁ గాదు. కాన నీతని యీ యీర్ష్యకు మనము సంతసింపవలసినదే కాని కోపింపఁదగదు. మఱియు నా భక్తులు నన్ను దిట్టినను, గొట్టినను, నే సహించి వారలఁ బుత్త్రస్నేహ ముతోఁ జూచుచుఁ గష్టకాలమున సంరక్షించుచుందును. ఈ యర్థంబు నీకును విదితంబై యుండనోపు. కాన నీవును నాభక్తుల నారీతినే ప్రేమించుచుండుము. ప్రకృతమున వీఁడు నిన్నసూయా భావమునఁ జూచినాఁడను మాట మఱచి దాని

కన్యథా భావింపక పుత్రస్నేహమునఁ జూడుము. నే నిప్పట్టున వీఁడు కోరిన దివ్యదృష్టినే కాక వేరొక వరంబు ననుగ్రహింపఁ దలఁచినాఁడను. నీవును వీనికి సదయ హృదయవై యొక వరంబును బ్రసాదింపుము. మన యిరువురకు నే విషయమందును గూడ నిసుమంతయు భేదంబులేదు. భేదముగలదని చెప్ప నేరికిని శక్తిలేదు. కోపము నుపసంహరించివీనిననుగ్రహింపుము. వీఁడును జిరకాలమునుండి నిద్రాహారముల మానియున్నవాఁడు. మనము వీనిని గృతార్థునిఁ జేసితిమేని సుఖంబుండు" నని చెప్పనుమయు నిజనాయకుని వాక్యముల కలరి గుణనిధియందుఁ బ్రసన్నురాలై వరమీయ సిద్ధురాలయ్యెను.

## —♦ ఉమా మహేశుల యంతర్ధానము ♦—

కాశీనాథుఁడు యాజ్ఞదత్తిపై నలుకఁ బూనియుండిన ప్రాణనాయిక నను నయవాక్యంబుల నోదార్చి "వత్సా! గుణనిధీ! నీ కింతకుముందే నాసఖ్యము నొసంగినవాఁడ. ఇప్పుడు నీకోరిన దివ్యదృష్టినిగూడఁ బ్రసాదించితి. ఇంకను నీవు నాకత్యంత భక్తుఁడ వగుటచే నీకు యక్ష,కిన్నర,గుహ్యక లోకాధిపత్యంబును; దిగీశ్వరత్వంబును గూడ ననుగ్రహించితి. వీనిని జేకొని చిరకాలము మాకుభక్తుఁడవై సుఖానసుండుము.

వలసినప్పుడు మమ్ముఁ దలఁచుకొనుము. పొమ్మ" అని సెలవీయ నుమయుఁ బుత్త్రివాత్సల్యంబు దోప "నాయనా! గుణనిధీ! నీభక్తికి మెచ్చితి. మీయయ్య యొసంగిన వరములు యథార్థంబు లౌఁగాక. నీవు కాశియందు నిలిపిన యీశ్వరుని దివ్యలింగము సర్వసిద్ధిప్రదము. అఖిల లోక వర్ణనీయము. నిఖిల పాప హారమును నగుగాత. మఱియు గాశియందుఁ గల కుబేరేశ్వరుని సందర్శించిన జనులకు ధనంబును, బుద్ధియు, విద్యయు, సాధునందనులును, భ్రాతలును, నుచిత కాంతయు, నిత్యశోభనమును, సత్పాధాన్యములును గలుగును. మఱియు శ్రీమన్మహాదేవు దక్షిణ భాగంబునఁ గుబేరేశ్వర స్థానంబునందుఁ గుబేరేశ్వరునిఁ సేవించిన వారికి నణిమాద్యష్టయిశ్వర్యంబులును సిద్ధించు" నని యానతిచ్చెఁ. తోడనే యాయజ్ఞదత్తిని గృతకృత్యుని గావించి దేవుండు దేవీ సహితుండై వైశ్వేశ్వరంబైన పదంబుఁ బ్రవేశించె. యాయజ్ఞదత్తియు శివుని చెలికారంబును జేకొని చైత్రరథవనంబును నమృతోపమంబులగు నుదకంబులఁ జెన్నొందు సరసులును, నవిధకైలాసంబును గలిగి యుత్తరపు దిక్కునఁ గల పుటభేదనంబును రాజధానిగఁ జేకొని యీశ్వరుని కరుణాకటాక్షమును బ్రాపుగ నెంచి, రాజరాజ నామంబున రాజసంబున

## ఆఱవ ప్రకరణము.

నేలుచుండె. మఱియు రాజరాజు గరళకంఠుఁడును ఫాలలోచనుఁడును నగు శివుని సదా ధ్యానించుచుండు.

ఆఱవ ప్రకరణము సమాప్తము.

పరిసమాప్తము.

---

